# తాజాగా కళకళలాడుతూ ఉండటానికి




# హమామ్

హమామ్‌తో స్నానం హాయిని కలిగిస్తుంది. దీని తాజాదనపు కళకళలాడించే హాయి మీ కుటుంబాన్ని ఆహ్లాదపరుస్తుంది.

హమామ్ — మిమ్మల్ని తాజాగా కళకళలాడించడానికి.

## ఎక్కువకాలం మన్నే స్నానాల సబ్బు

ది టాటా ఆయిల్ మిల్స్ కంపెనీ లిమిటెడ్

# లోకం పోకడ — ఊమెన్





**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

[1938–1972]

శుక్రవారం : 8–7–'77

పింగళనామ సం. అధిక ఆషాఢమాస బ. అష్టమి

*సంపుటము 70 : సంచిక :45*

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41–60

ఆరుమాసాల చందా రు. 20–80

విడి ప్రతి వెల 75 పైసలు

ఆంధ్రపత్రిక కార్యాలయము

గాంధీనగరం, విజయవాడ–520003.


## విషయానుక్రమణిక

అట్టమీద బొమ్మ : సింపుల్ కపాడియా

(ఫోటో : కాంతిలాల్ మిస్త్రి)

*కథలు :*



*సీరియల్ కథలు :*



*వ్యాసాలు, శీర్షికలు :*

## అట్టమీదబొమ్మ

24.6.77వ తేది శారద ముఖచిత్రంతో వెలువడిన మీ [మా] పత్రిక మమ్మల్ని ఎంతో ఆకర్షించింది. ముఖచిత్ర విషయంలో మీరు తీసుకున్న శ్రద్ధకి కృతజ్ఞతలు. తమ సోమా జ్యోతిర్గమయ సీరియల్ ప్రారంభంలోనే మమ్మల్ని ఆకట్టుకుంది. పాలాక్షుని డైరీ బాగుంటుంది. శ్రీనివాస్‌గారి సినిమా విశేషాలు చాల బాగుంటున్నాయి.

జి. వి. ఎల్. కుమారి, అంకం ధర్మారావు,
జి. లీలావతి అప్పారావు (పొందూరు)

* * *

24.6.77 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక నందు మీరు ప్రచురించిన ముఖచిత్రం మమ్మల్నెంతగానో ఆకర్షించింది. నటీమణుల ముఖచిత్రాలతోపాటు ప్రముఖ నటుల ముఖచిత్రాలు కూడా ప్రచురిస్తే బాగుంటుంది.

కలపటపు గిరిజాకుమార్, (విజయవాడ—2)

* *

ఖరీదయిన అట్టలపై సెక్సీ ముఖ చిత్రాలు వేసి చాలా విసుగుకలిగిస్తున్నారు సార్. ముఖచిత్రాల పట్ల శ్రద్ధ వహిస్తే బాగుంటుందని మా మనవి. మరీ వేసిన వాళ్ళే వేస్తూ కూడా చిరాకు కలిగిస్తున్నారు. ఇకనైన దయచేసి మంచి ముఖచిత్రాలను వేస్తారని భావిస్తున్నాము. పత్రికలోని సీరియల్స్ చాలాహాయిందాగా ఉన్నాయి.

కె. రాజేశ్వరి కె. మహేశ్వరి, (చంద్రగిరి)

* *

17.6.77 ఆంధ్రపత్రిక అట్టమీద బొమ్మ జయశ్రీ టి. గారిది వేశారు. అయితే ఆ చిత్రం మరీ సెక్సీగా ఉంది. ఇలాంటి సెక్సీ చిత్రాలు వేసి ఆంధ్రపత్రిక స్థాయిని తగ్గించవద్దు! [మా]




ఆంధ్రపత్రికపై మాకున్న అభిమానాన్ని మళ్లించవద్దు! రాజకీయ నాయకుల ముఖచిత్రాలు కూడా వేయండి! కాదా? శాపం! కవిత మమ్మల్నెంతో ఉత్తేజితుల్ని చేసింది. ఆ రచయిత్రి ఎం. విజయకుమారిగారికి పత్రికాముఖంగా సాహితీ కృతజ్ఞతలు. ఒక కన్య చెపిన కథ సాఫీగా సాగుతోంది! ముఖ్యంగా ప్రశ్నావళిలో రామలక్ష్మిగారు ఒక పాఠకుని ప్రశ్నకు జవాబిస్తూ చలం ఒక బుషో ఎస్కేపిస్టో అంటూ వ్యాఖ్యానించారు. చలం ఒక మహా మేధావి. మహా గొప్ప కవి! ఇది జగద్విదితమే! రామలక్ష్మిగారు అలా అనడం ఆమె అహంకారానికి తార్కాణమేమో! పరోపకారికి శ్రీగున్‌గారి బొమ్మ ఎంతో బాగుంది.

యార్లగడ్డ రాజేశ్వరరావు, (పాలకొల్లు)

## అవసరం

తేది 17.6.77 మీ [మా] పత్రిక చదివాను. బాగుంది. విషయానుక్రమణికలో ధర్మపథం శీర్షిక 32వ పేజీలో అని ఉంది. తీరా చూస్తే హమామ్ సబ్బు ప్రకటన ఉంది ఇది చాలా నిరాశ కలుగజేసింది. ధర్మాన్ని, నీతిని అందించే శీర్షిక ధర్మపథం ఎంతైనా అవసరం. డాక్టర్ సలహాల శీర్షికలో వాడవలసిన మందుల ద్వారా సలహాలు నందించితే ఇంకా బాగుంటుంది.

ఎస్. సులోచనారావ్ [వేములవాడ]

## సీరియల్

24.6.77 సంచికకు శారద ముఖచిత్రం ఎంతో కళ తెచ్చింది. తను సోమా జ్యోతిర్గమయ సీరియల్ ఎంతో ఆసక్తిదాయకంగా ఉంది. యువతకు ఈ నవల నచ్చుతుందనడంలో సందేహం లేదు. కోమలి — కోరిక కథ ఆనందం కల్గించింది. శ్రీనివాస్‌గారి సినిమా వార్తలలో ఆసక్తి లోపించింది.

ఆర్. ఆదావ్, (కర్నూలు)

* * *

24.6.77వ ఆంధ్ర సచిత్ర వారపత్రిక శారద ముఖ చిత్రం చాల ఆకర్షణీయంగా ఉంది. ఈ పత్రికలో మూడు కథలు చాలా బాగున్నాయి. ఫణి ఐ పిటియూ కథలు ప్రేక్షకులను పాటకులకు ఎంతో నచ్చాయి.

ఇంకపోతే సీరియల్సు ఒక కన్య చెపిన కథ ఎంతో ఉత్సాహంగా ధారావాహికంగా సాగిపోతున్నది. దారి తప్పిన తండ్రి వంటి సిరియల్స్ మీరు ప్రోత్సహించమని మా మనవి. రామలక్ష్మిగారు కలమునుండి వెలువడిన దారి తపిన తండ్రి సీరియల్‌లో అన్నపూర్ణమ్మ పాత్ర మొదట నుండి కష్టాల్లోనే సాగిపోతుంది. కన్నకొడుకు ప్రేమ కోసం తన మాంగల్యాన్ని త్యాగం చేసిన ధన్యజీవి.

వి. రవీంద్రభారతి, (అనంతపురం)

## కథలు

3.6.77వ తేదీన వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని అన్ని కథలు బాగున్నాయి. అన్నిటి కంటే శవ పంచాయతీ కథ నన్నెంతో ఆకర్షించింది. చనిపోయిన తన భార్య శవాన్ని పిల్లకాయలకి నాల్గు రోజుల గంజి నీళ్ల కోసం అమ్మినా నాకంత బాధ కలుగలేదు కాని తన స్వహస్తాలతో ఆమె ప్రతి అవయవాన్ని అలా ముక్కలు ముక్కలుగా కోయగల గంగయ్య ధైర్యం మెచ్చదగినది. ఇకముందు కూడ పత్రికలో ఇలాంటి మంచి కథలే ప్రచురితమవుతాయని ఆశిస్తున్నాను.

పి. పద్మజ (కావలి)

* * *

3—6—77 ఈవారం వెలువడినపత్రికలో అన్ని కథల కంటే శవపంచాయతీ కథ నాకెంతో నచ్చింది. ఈ కథ చదవగానే మనసంతా ద్రవించి కళ్లమ్మటా నీళ్లు కూడా వచ్చేశాయి. చాలా కాలానికి ఎంతో మంచి కథ చదివాననే భావం కలిగింది. ఇకపోతే శాంతి కథలో రచయిత్రిగారు పొరపాటు పడ్డారనుకుంటాను. శాంతి విడోదావరి తలలో గుబాళించే సన్నజాజులు అని వ్రాశారు. అలా వ్రాయడం పొరపాటేకదా. సీరియల్స్ రెండూ ఇంట్రెస్టింగ్‌గా ఉన్నాయి.

పి. ఇందిర, [ఇల్లెందు]






'గణగణ' మంటూ మోగింది అలారం.

ఆ శబ్దానికి మెళుకువొచ్చింది కస్తూరికి. బద్ధకంగా మెడ వెనక్కి తిప్పి, అలారంవైపు చూసింది. 'ఆరు దాటింది మేడమ్ లేస్తారా?' అంది వినయం వొలకబోస్తూ ఆ గడియారం! 'షటప్' అంటూ దాన్ని ఒక మొట్టు మొట్టింది కస్తూరి వేడంచేతో. బుద్ధిమంతురాలిలా నోరు నొక్కుకుంది అది. మళ్ళా సరిగ్గా పడుకుంది కస్తూరి. కళ్ళు మూసుకుందిగానీ; బద్ధకమే తప్ప నిద్ర రాలేదు. ఏ ఆలోచనా మనసులోకి రాకుండా, ప్రశాంతంగా ఇంటి కప్పుకేసి చూస్తూ అలా పది నిముషాలన్నా పడుకోవటం ప్రతిఉదయం లేచేముందు అలవాటు కస్తూరికి. రోజల్లా గడిపే పద్నాలుగు గంటలపైబడ్డ నిమిషాల్లోనూ ఆ పది నిముషాలు చాలా సంతృప్తిని, హాయిని, రోజలా గడిపే ఉత్సాహాన్నీ యిస్తాయామెకి!

దాదాపుగా పది నిమిషాలు కావడంతో, లేచి కూర్చుని బద్ధకంగా వొళ్ళు విరుచుకుంది కస్తూరి. చీ కుచ్చిళ్ళు మోకాళ

## గొలుసు కథ

మించి చివరిదాకా సర్దుకుని, చెదిరివున్న పమిటని సరిగ్గా వేసుకుని జుట్టు వేళ్ళతో సర్దుకుని మంచం మీదనుంచి దిగింది.

ఒకసారి మంచంమీంచి దిగిందంటే, ఇహ మళ్ళీ ఆఫీసుకివెళ్ళి, సీట్లో కూర్చునేవరకూ ఆ కాళ్ళు ఒకచోట స్థిరంగా నిలిపే అవకాశం కలగదు కస్తూరికి.

'కావటానికి ఆఫీసరైనా యింటి పనుల్లో ఒక్క పిసరయినా అశ్రద్ధ చూపించదమ్మా మా కస్తూరి! అది కల్పించుకుందంటే నిమిషాలమీద అయిపోతాయి పన్లు. నాకు కావలిసినంత తీరిక ...' అనే సుభద్రమ్మ మాటల్లో తల్లిప్రేమతోపాటూ నిజంకూడా వుంది – నూటికి ఎనభైపాళ్ళు!

ముఖం కడుక్కుని వంటయింట్లోకి వెళ్తూనే, కాఫీ కలుపుతున్న తల్లిని చూసి, "టిఫినేమిటమ్మా యివాళ?" అడిగింది.

"పూరీలు చేస్తానే!" అంది సుభద్రమ్మ, కూరలబుట్ట ముందుకి లాక్కుని, బంగాళా దుంపలు బయటకు తీసి, గబగబ ముక్కలు తరిగి, స్టౌమీద పడేసి, దొడ్లోకి వెళ్ళి బాయిలర్ తిప్పి చూసింది కస్తూరి. నీళ్ళు కాగాయి స్నానం కానిచ్చి, అరుణకి నీళ్ళు తోడిపెట్టి, తన గదిలోకి వెళ్ళింది. శుక్రవారం కావటాన తలారా స్నానం చేసిందేమో – తల చిక్కులు పెడుతోంది. అద్దం ముందు కూర్చుని తల దువ్వుకుని, అలంకరణంతా పూర్తిచేసేసరికి, అరుణ వచ్చింది స్నానంచేసి. దానిక్కూడా జడ వేస్తుండగానే, తల్లి కేక వినపడింది.–

"భోజనాలకి వస్తారుటే?"

"ఆ......ఆ" అంటూనే, "అన్నయ్య వచ్చేశాడా?" అంది కస్తూరి. సమాధానంగా వంటింట్లోంచి స్టీలు కంచం మీద స్పూన్ శబ్దం 'గణ గణ' వినపడింది. 'పిలబడింది సారూ'' అంటూ గబగబ వంటింట్లోకి పరిగెత్తింది కస్తూరి.

భోజనాలు కావటంలోనే 'త్వరగాపద కస్తూరీ, ఇవాళ కొంచెం ముందుగా వెళ్ళాలి నేను'' అన్నాడు శేఖర్.

# కస్తూరి

"అలాగే అన్నయ్యా అయిదు నిమిషాలు" అంది కస్తూరి.

పావుగంటలో "మేం వెళ్ళుతున్నామమ్మా," అంటూ కేక పెట్టేందివరండాలోంచి కస్తూరి "వస్తున్నా" అంటూ రెండు టిఫిన్ బాక్సులూ పట్టుకు వచ్చింది సుభద్రమ్మ వాటి నందుకుని, వాకిట్లోకి నడిచి, స్కూటర్ మీద కూర్చుంది కస్తూరి.

"జాగ్రత్త్రరా" అన్న సుభద్రమ్మ కేక, వాళ్ళకి వినపడిందోలేదో తెలియదు కానీ, స్కూటర్ మాత్రం జాగ్రత్తగానే ముందుకి పరిగెత్తింది.

"అది ఉద్యోగంలో చేరి ఆరునెలల వాటింది గానీ, నీ హెచ్చరిక మాత్రం మానవు" అన్నారు వరండాలో కూర్చుని పేపరు చూస్తున్న జానకి రామయ్యగారు.

"బావుంది. ఆరునెల్లయితేనేం, ఏడాదయితేనేం – తల్లి ప్రాణం నాది! ఆ పెద్దాడి స్కూటర్ నడక చూస్తుంటే నాకు ప్రాణం కడబడుతుంది" అంది లోపలికి నడుస్తూ ఆవిడ.

* * *

బాంక్ సమీపిస్తూనే స్కూటర్ ఆపాడు శేఖర్.

కస్తూరి దిగి. 'టాటా' అంది.

'టాటా' అంటూ ముందుకి దూసుకు పోయాడతను. క్షణంలో ఆరోడ్డుమీది జనంలో కలిసిపోయాడు.

లోపలికి నడిచింది కస్తూరి. అటెండెన్స్ రిజిష్టర్లో సంతకం చేసి, తన సీట్లోకి వెళ్ళింది.

"గుడ్ మార్నింగ్" అంది మంగళ కస్తూరిని చూస్తూనే.

"గుడ్ మార్నింగ్– అప్పుడే వచ్చేశారే?" అంది కస్తూరి

"ఏంలేదు–యివాళ బస్ కాస్త ముందే వచ్చేసిందండీ!" అందామె.

"ఓహో" అంటూ కూర్చుని, రిజిష్టర్స్ కేసి దృష్టి మళ్ళించింది, కస్తూరి. ఆ తరువాత పరిసరాల్ని మరిచి పనిలో లీనమైపోయింది.

చేరి ఆరునెలలే అవుతున్నా సహజమయిన చురుకుదనానికీ, తెలివితేటలకీ తోడు ఆమె కష్టపడే స్వభావం బాంక్ ఉద్యోగంలో బాగా ఇమిడిపోయింది కస్తూరి. కస్తూరి సీట్లో వుంటే, పబ్లిక్‌కి ఎక్కువసేపు వెయిట్ చేసే అవసరం వుండదు.

దాదాపు రెండుగంటలు గడిచిపోయాయి. ఆరోజు ఎందుకో జన ప్రవాహం కాస్త పలచగానే వుంది. కాస్త వూపిరి పీల్చుకుంది కస్తూరి వేసవి కావటంతో ఫాన్ తిరుగుతున్నా, వేడిగాలి మాత్రమే వస్తూ ఉక్కగా వుంది. అటెండర్ని పిల్చి, "మంచినీళ్ళు తెచ్చి పెడతావూ కాస్త?" అంది. మంచినీళ్ళు తాగుతుండగా "ఎక్స్క్యూజ్ మీ" అన్నగొంతు వినబడింది, తలతిప్పి చూసింది కస్తూరి.

"సేవింగ్స్ అకౌంట్ వోపెన్ చేద్దామని." అంటున్న అతను హఠాత్తుగా ఆగి. "మీరు.. మిమ్మల్ని ఎక్కడో చూశానండీ..." అన్నాడు. వింతగా అతడికేసి చూసింది కస్తూరి. ఆమెకేమీ గుర్తుకు రాలేదు' 'కూర్చోండి" అంది ఎదురుగా వున్న సోఫా చూపిస్తూ. అతను కూర్చున్నాడు ఆవెంటనే అన్నాడు–"ఆఁ... మీ పేరు.. మీపేరు కస్తూరిబాయి. అవునా?"

"ఔను"

"అయితే మిమ్మల్ని బాంక్ యింటర్వ్యూలోనే చూశానండీ! నన్ను గుర్తు పట్టలేదూ మీరు?" ఉత్సాహంగా వుంది అతని గొంతు,

"నా పేరు శ్యాంసుందర్."

"ఆఁ... గుర్తు వచ్చింది. ఆవాళ చివరిదాకా మిగిలింది మనం యిద్దరమే కదూ!" అంది కస్తూరి.

"ఎగ్జాక్ట్లీ! అయితే మీరు సెలెక్టయ్యారన్నమాట! కంగ్రాచ్యులేషన్స్,"

"థాంక్యూ! మీరు ... సెలెక్టు కాలేదా?" సంశయంగా అడిగింది కస్తూరి.

"లేదండీ!"

"ఓ!... సారీ"

"నాట్ నెససరీ! నాకు ఏ. జీ. ఆఫీస్‌లో అసిస్టెంట్ అకౌంటెంట్ జనరల్ సెలెక్షన్ వచ్చిందిలెండి."

"ఐసీ! కంగ్రాట్స్... అయితే!"

"థాంక్యూ" ఇద్దరూ నవ్వుకున్నారు.

"ఏం పనిమీద వచ్చారు?" అడిగింది కస్తూరి.

"అకౌంట్ ఓపెన్ చేయ్యాలని..."

"ఓ. యస్. ఫారం తెప్పిస్తానుండండి."

"ఫారం నేను తీసుకున్నాను. ఇదిగో..."

అతడి చేతిలోంచి ఫారం అందుకుంది కస్తూరి

"ఇక్కడ వివరన్నా అకౌంటున్న వాళ్ళు సైన్ చేయాలండి అంది, ఫారం చూపిస్తూ.

"అదే అన్నాడు మీ కౌంటర్ క్లర్క్. కానీ నాకిక్కడ హఠాత్తుగా తెలిసిన వాళ్ళెలా దొరుకుతారూ, చెప్పండి" నవ్వాడు సుందర్.

"నిజమే," తనూ చిరునవ్వుతో అంది కస్తూరి, "రేపు తీసుకురండి, సంతకం వేయించి!"

"అబ్బ. మళ్ళీ రేపు రావాలి!"

"అకౌంట్ ఓపెన్ చేశాక, తరుచు రావాలిసిందే కదా!" నవ్విందామె.

ఒక్క నిమిషం ఆగి అన్నాడు సుందర్. "పోనీ-మీరే సైన్ చేసెయ్యకూడదూ?"

"నేనా?" తెల్లబోయింది కస్తూరి.

"అవును. ఏం?"

ఇబ్బందిగా అనిపించింది కస్తూరికి. పెద్ద పరిచయం కూడా లేకుండా, కేవలం ముఖ పరిచయంతో యిలా సైన్ చేయటం ఆమెకి యిష్టం లేకపోయింది.

"నేను చెయ్యకూడదండీ!" అంది నెమ్మదిగా.

"ఇట్సాల్ రైట్" అన్నాడతను.

మరో అయిదు నిమిషాలు కూర్చుని, "రేపొస్తానండీ" అంటూ వెళ్ళిపోయాడు సుందర్.

'భోళా మనిషి – కలుపుగోలు కూడా! బాంక్ ఆఫీసర్ని తలదన్నే ఉద్యోగం వచ్చిందే –ఏ. ఏ. జీ ట! అబ్బో' అనుకుంది కస్తూరి అతను వెళ్ళిపోయాక.

* * *

కస్తూరి అనుకొన్నంత భోళా మనిషి కాదు సుందరం. అనుకున్నదేదయినా సాధించే వరకూ నిద్రపోనంత పట్టుదల మనిషి. మాట లెంత తొందరగా మాట్లాడతాడో, మనిషి అంత నిదానంగా ఆలోచిసాడు.

బాంకు ఇంటర్వ్యూలోనే కస్తూరి ఆకర్షించింది సుందరాన్ని, అయితే, ఆ తరవాత ఆమె గురించి క్రమంగా మర్చిపోయాడతను. తనకి ఉద్యోగం రాని బాధలో కొన్నాళ్ళూ—ఉద్యోగం దొరికిన ఆనందంలో తరవాతా! మళ్ళీ బాంక్‌లో ఆమెను చూడగానే, అతడిలో ఆశ చిగురించింది.

ఆ మర్నాడు బాంక్‌లో అకౌంట్ తెరవటానికి వచ్చినప్పుడే కాక. ఆ తరవాత కూడా తరుచు బాంక్‌కి రాసాగాడతను. ఆమె కంట బడితే చులకన కావటమో, ఆమెలో చెడు అభిప్రాయం కల్గటమో జరుగుతుందని పించటంతో ఆమెకి మాత్రం కనుపించేవాడు కాదు.

నెలరోజులు గడిచేసరికి, కస్తూరికి సంబంధించిన అన్ని వివరాలూ సేకరించాడు సుందరం. ఆమె నెలాగైనా తనదాన్ని చేసుకోవాలన్న నిర్ణయానికి రావటమే తడవుగా, మరి ఆలస్యం చేయలేదతడు. ఆమెనించి ఎలాటి అభ్యంతరం వుండబోదనే అతడికి అనిపించింది.

* * *

మిట్ట మధ్యాహ్నం ఒంటిగంట దాటుతున్న వేళ జానకి రామయ్యగారు నడవాలో పడుకుని పేపరు తిరగేస్తున్నారు. సుభద్రమ్మ ముందుగదిలో గడపమీద తలెట్టుకుని, 'స్త్రీల వ్రతకథలు' చదువుకుంటోంది.

ఆసమయపు నిశ్శబ్దాన్ని భంగంచేస్తూ "అమ్మాయ్" అంటూ ప్రవేశించాడు జగన్నాధం.

పుస్తకం కళ్ళముందునించి తీసేసి జగన్నాధాన్ని చూసిన సుభద్రమ్మ "రా అన్నయ్యా!" అంటూ గబుక్కున లేచి కూర్చుంద, విడిపోయిన కొప్పు ముడివేసుకుంటూ.

"బావగారున్నారా?"

"ఆ..ఏమండోయ్, అన్నయ్యొచ్చాడు" అంటూ కేకేసిందావిడ. ఆకేకవిని, పేపరు మడిచిపుచ్చుకు బయటికి వచ్చారు జానకి రామయ్యగారు.

"రావయ్యాబావా" అన్నారు జగన్నాధాన్ని చూస్తూ ఇద్దరూ కుర్చీల్లో కూర్చున్నారు.

"మంచినీళ్ళు తెస్తాను" అంటూ లోపలికి కదలబోయింది సుభద్రమ్మ.

"మంచినీళ్ళు కాదు– నిమ్మకాయమజ్జిగ తీసుకురా– మీకో శుభవార్త మోసుకొచ్చాను ఎండని లెక్కచెయ్యకుండా" అన్నాడు జగన్నాధం

"అయ్యో– దానికేం భాగ్యం" అంటూ లోపలికి వెళ్ళిందావిడ. మరోఅయిదు నిమషాల తరవాత, మజ్జిగ గ్లాసు కిందపెట్టి అన్నాడు జగన్నాధం–

"మొత్తానికి అదృష్టవంతుడివయ్యా?"

"ఏమిటయ్యా, అంత అదృష్టం?" అడిగాడు జానకిరామయ్య.

"అదృష్టం కాకేమిటి? మన కస్తూరికి ఎలాటి సంబంధం తెచ్చానో తెలుసా?"

"కస్తూరికి సంబంధం తెచ్చావా?" ఆత్రుతగా అంది సుభద్రమ్మ.

"అలాంటిలాంటిది కాదు! అబ్బాయి ఏ.జీ ఆఫీసులో క్లాస్‌వన్ ఆఫీసరు! ఐ ఏ యస్ ప్యాసయ్యాడు!"

"అమ్మో! అంత పెద్ద సంబంధమా" అన్నాడు, జానకిరామయ్యగారు నోరు తెరిచి.

"బావుంది మీ వరస ముందు చెప్పనివ్వండీ! అమ్మాయిమాత్రం తక్కువదా? ఏమ్మె పాసై, బాంకులో ఆఫీసరు చేస్తున్న దానికి పెద్ద సంబంధం చూడద్దూ?

(42వ పేజీ చూడండి)

# ఇరుసు

చివుకుల సీతారామబాబు



అతన్ని ఇందాకటినుండీ గమనిస్తున్నాను.

ప్లాట్‌ఫారంమీద తిరుగాడుతున్న ప్రతి వ్యక్తినీ పట్టిపట్టి చూస్తున్నాడు, వాళ్ళ ముఖ భావాలని క్షుణ్ణంగా పరిశీలిస్తున్నట్టుగా ఉన్నాయి ఆతని చూపులు.

నాకు చాలా దగ్గరలోనే ఉన్నాడు.

చేతిలో సంచీ ఖరీదయిన గుడ్డల్లోనే ఉన్నాడు. వయస్సు పాతిక దాటిఉంటాయి.

అతని పరిశీలనలో మాకు కొద్దిదూరంలో కూర్చునిఉన్న యాభైఏళ్ళ ముసలాయన — ఇరవైఅయిదేళ్ల వయస్సుగల స్త్రీ కూడా ఉన్నారు. ముసలాయన ఆ అమ్మాయితో కన్నడంలో ఏదో చెబుతున్నాడు. ఆ అమ్మాయి తల వంచుకుని మౌనంగా ఆయన మాటలను వింటున్నది. ఆయన ముఖంలో ఏదో బాధ ప్రస్ఫుటమవుతుంది. ఆమెకేదో వచ్చుచెప్పాలని ప్రయత్నిస్తున్నట్టుగా తోచింది నాకు.

ప్లాట్‌ఫారం అంతా రద్దీగాఉంది. అదృష్టవశాత్తూ మా చుట్టు ప్రక్కల అంతగా జనంలేరు—స్టేషన్ అంతా ఏదోగోల. అవతల ప్లాట్‌ఫారం మీద ఏదోబండి వచ్చి ఆగినట్టుంది. ఇంజను పెద్దగా కూత పెడుతుంది.

అతను నాకేసి చాలాసార్లు చూశాడు. అలా చూడటంతో మా ఇద్దరి కళ్ళు కొన్ని క్షణాలపాటు కలుసుకున్నాయి. ఆ పరిచయం ఆసరాగా ఆతన్ని పలకరించాలని బుద్ధి పుట్టింది.

“ఏ ఊరు వెళ్ళాలి ?” అడిగాను అతన్ని చూసి నవ్వుతూ.

“కాజీపేట”అతనూనవ్వుతూనే చెప్పాడు.

ఆ సమయంలో అతని కళ్ళునన్నే పరీక్షగా చూస్తున్నాయని, నన్నేదో చదవాలని తాపత్రయ పడుతున్నాయని నాకు తెలుస్తూనే ఉంది.

అంతకుముందే కొన్న నా చేతిలోని వారపత్రిక చూస్తూ అన్నాడతను — “మీరు పుస్తకాలు బాగా చదువుతారా ?”

తల ఊపాను.

“ప్రస్తుతం వచ్చే రచనల్లో మీరు ఏ రచయితని ఇష్టపడతారు ?”

అతను ఆ ప్రశ్నవేయటంలో చాలా ఊహ చేశాడని అన్పించింది. నా ఉద్దేశ్యం ప్రకారం ఆ ప్రశ్నకు నేను ఇచ్చే సమాధానాన్ని బట్టి సాహిత్యరంగంలో నాకు గల ఎరికను తెలుసుకునే ప్రయత్నంలో వున్నాడు.

కొంతమంది పేర్లు చెప్పాను.

అతను ఆశ్చర్యపోయాడు నా జవాబువిని. నేను చెప్పిన పేర్లన్నీ సంఘంలో రచయితగా బాగా గుర్తింపబడినవాళ్ళవే.

“ఫర్వాలేదు. మంచివాళ్ళ పేర్లే చెప్పారు. అంటే మీరు బాగా చదువుతారన్న మాట పుస్తకాలు” అన్నాడు.

అతను అలా అనటాన్ని బట్టి నానోటి మీదుగా అలాంటి వాళ్ళపేర్లని ఊహించలేదని నాకనిపించింది! పైగా నన్నుగురించి అతను తక్కువగా అంచనా వేశాడనిపించింది కూడా.

“నేను కథలు రాస్తుంటాను” అన్నాడతను కొంతసేపు ఆగి.

అలా అంటుంటే అతని కళ్ళు గర్వంగా మెరిశాయి. కథ రాయటం అనేది ఈనానవ జీవితంలో అత్యున్నతమయిన గొప్పదనంగా అతను భావిస్తున్నట్లు అన్పించింది.

"అలాగా" అన్నాను మామూలుగా.

బహుశా అతని మాటలు విని ఆశ్చర్యపోతానని అతను అనుకుని ఉండాలి—నాలో అలాంటి భావం ఏదీ వ్యక్తం కాకపోవటంతో కొంత ఆశాభంగం చెందినట్లుగా కనిపించాడు కానీ అంతలోనే మళ్ళీ మామూలుగా అయిపోతూ—

"రెండు కథలు ప్రచురితమయినాయి కూడా" అన్నాడు. నవ్వొచ్చిందినాకు;

అతన్ని చూస్తుంటే కాదు. అతనిమాటలకు, వాటివెనుక తొంగి చూస్తున్న భావానికి మాత్రమే.

"ఈమధ్య బొత్తిగా సాహిత్యరంగం చెడిపోయినది. అడ్డమైన వాళ్ళు కథలు రాసేస్తున్నారు" అన్నాను.

నామాటలకు అతను ఉలిక్కిపడ్డాడు.

నా నుంచి సాహిత్య రంగంమీద అంత ఘాటైన కాంప్లిమెంట్ వస్తుందని అతను ఊహించి ఉండడు. పైగా నా మాటలు అతన్ని ఉద్దేశించి అన్నట్లుగా అతను ఫీలయ్యాడనిపించింది.

"బాగా రాయగలవాళ్ళు ఎప్పుడూ బాగానే రాస్తారు. రాయలేనివాళ్ళు ఎన్ని అవకాశాలున్నా కూడా రాయలేరు. అలాగని అందర్నీ ఒక కట్టగా కట్టలేము" అన్నాను మళ్ళీ.

నా మాటలతో అతను కొంత రికవర్ అయ్యాడు.

"నిజమే మీరు చెప్పింది. రచయిత అనేవాడికి పరిశీలనా దృష్టి చాలా ఎక్కువగా ఉండాలి. అది లేనప్పుడు అతని రచనల్లో వాస్తవికత లోపిస్తుంది. ఏమంటారు?" అన్నాడు అతను.

అలా అంటున్నప్పుడు కూడా అతని కళ్లల్లో గర్వ భావం తొంగి చూస్తూనే ఉన్నది. ఒక రచనలోని వాస్తవికతను తాను కనుగొని బయట పెడుతున్నట్లు అతను ఫీలవుతున్నాడేకాని, ఆ మాటలు యధాలాపంగా అంటున్నట్లు లేవు.

"నిజమేనేమో!"

"రచయిత సమాజానికి టానిక్ వంటివాడు. సమాజానికి ఏవేం కావాలో తెలుసుకుని అందివ్వగలిగే సామర్థ్యం ఉండాలి. సమాజం పట్ల ఎంతో మెలకువగా వ్యవహరించాలి. తన చుట్టూ ఉండే ప్రతి వ్యక్తినీ ప్రతి వస్తువునీ ఎంతో పరిశీలనాత్మకంగా చూడగలగాలి. ప్రతి చిన్న విషయాన్నీ కూడా సాకల్యంగా అవగాహన చేసుకోవాలి" ఆవేశం కూడిన స్వరంతో చెబుతున్నాడు అతను. నేనేం మాట్లాడలేదు.

"అదే మామూలు వాళ్లకు మాకు ఉన్న తేడా. మీలాంటి సాధారణ వ్యక్తులు ఏ విషయాన్నైనా ఒక దృక్కోణం నుండి మాత్రమే చూడగలుగుతారు. ఎదుటివాడు ఎలాంటి పరిస్థితిలో ఉన్నాడో మీరు ఆలోచించలేరు. కాని రచయితకు అది సాధ్యం. ఎందుకంటే అతను ఏ విషయాన్నైనా వివిధ దృక్కోణాలనుండి చూడగలడుకాబట్టి

అతని మాటల్లో అతిశయం ఎక్కువగా ఉన్నది. రచయితని అని చెప్పుకోటంవల్ల తనకుతాను ఓ 'సుపీరియారిటీ'ని ఆపాదించుకుంటున్నాడు. అలా ఆపాదించుకోవటం వల్ల కొంత తృప్తినీ, గర్వాన్నీ అతను పొందుతున్నాడు.

ఆ తర్వాత కొంతసేపు అతనేం అనలేదు.

"వాళ్ళని చూస్తున్నారా?" అన్నాడు అతను కొంతసేపటి తర్వాత. అతను చెబుతున్నది కన్నడం మాట్లాడుతున్న ముసలాయన ఆ అమ్మాయిలగురించి.

"ఆ" అన్నాను—

"నిజానికి వాళ్ల భాష ఏమిటో నాకుతెలీదు. ఇప్పటికి అరగంటనుండీ వాళ్ళు మాట్లాడుకుంటూనే ఉన్నా ఒకముక్క కూడా నేను అర్థం చేసుకోలేకపోయాను కానీ..."

ఇంతలో ఎవరో వచ్చి అగ్గిపెట్టె అడగటంతో ఆగిపోయాడు అతను. అగ్గిపెట్టె ఇచ్చి ఆ వ్యక్తి సిగిరెట్టు కాల్చుకునేదాకా ఆగి అగ్గిపెట్టె జేబులో వేసుకుంటూ తిరిగి చెప్పనారంభించాడు.

..."కానీ వాళ్ళిద్దరు ఏంతటి పరిస్థితిలో ఉన్నారు — అనేది నేను ఊహించగలను. నా ఊహ ఏమాత్రం తప్పుకాదుకూడా" స్థిరంగా అన్నాడు అతను.

ఆ మాటల వెనుక తన పట్ల తనకుగల తీవ్రమైన నమ్మకం వ్యక్తమవుతుంది. దానితోపాటుగా అలాంటి ప్రజ్ఞ అతనికి ఉన్నందుకు అతను కొంత గర్వపడుతున్నట్లుగా ఉంది.

"ఎలాంటి కండిషన్లో ఉన్నారంటారు?" కుతూహలంగా అడిగాను.

నవ్వాడతడు చిన్నగా.

సిగిరెట్టు వెలిగించి పొగ వదులుతూ—

"వాళ్ల వయస్సులు — మాట్లాడుకునే తీరు — ముఖభావాలు — వీటినిబట్టి వాళ్ళు మూడు రకాలు అయిన పరిస్థితుల్లో ఉండవచ్చును. అంతే."

"ఏమిటని?"

అతను గట్టిగా పొగపీల్చి రింగులుగా వదులుతూ చెప్పటం మొదలుపెట్టాడు.

"మొదటిది — వాళ్ళిద్దరు తండ్రీ కూతుళ్ళు అయిఉంటారు. ఆమెను ఆ ముసలాయన పుట్టింటికి తీసుకుపోతున్నాడు. ముఖ భావాలనిబట్టి ఆయన ఏదో బాధపడుతున్నట్లుగా తోస్తున్నది. కనుక ఇంటిదగ్గర ఎవరన్నా ప్రమాద పరిస్థితిలో ఉండి ఉంటారు. అంటే అతని భార్య కావచ్చు. లేక కొడుకు కావచ్చు ఆ ఇంటి సభ్యుల్లో ఎవరైనా సరే" అని ఆపాడు అతను.

నేను కుతూహలంగా వింటున్నాను.

## సెప్టెంబరువరకు వాతావరణ సూచనలు

భారత వాతావరణ పరిశోధనశాఖ సూచనల ప్రకారం మనదేశ వాయవ్య ప్రాంతంలోనూ, దక్షిణ ద్వీప కల్పంలోనూ 1977 జూన్ నుండి సెప్టెంబరు వరకు మామూలు వర్షాలు కురుస్తాయి.

ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో గత వాతావరణ అనుభవాలను దృష్టిలో పెట్టుకొని జూన్— సెప్టెంబరు కాలంలో కురిసే వర్షాలను చాలా ముందుగానేపసిగట్టే స్థితిలో మనం ఉన్నాము. ఈ అంచనాలు 80 శాతం విజయవంతమైన అనుభవాలను దృష్టిలో పెట్టుకొని చేయబడ్డాయి.

మహారాష్ట్ర, గుజరాత్, మధ్యప్రదేశ్, తెలంగాణా, లోతట్టు కర్నాటక (ఉత్తర) కోస్తాఆంధ్ర, కోస్తా కర్నాటక (దక్షిణకనరా మినహాయించి) లలో 1977 జూన్ నుండి సెప్టెంబరు వరకు సాధారణంగా కురిసే వర్షంలో 97 శాతం కురుస్తుంది. జమ్ము మరియు కాశ్మీర్, పశ్చిమ ఉత్తరప్రదేశ్, హర్యానా, పంజాబు, హిమాచల్‌ప్రదేశ్, ఢిల్లీ చండీఘర్, రాజస్థాన్‌లలో 1977 జూన్ నుండి సెప్టెంబరు వరకు సాధారణంగాకురిసే వర్షం ప్రకారం 106 శాతం కురుస్తుంది.

"ఇక రెండో విధంగా చెప్పాలంటే అతను ఆ అమ్మాయికి మామగారు. ఆ అమ్మాయిని వాళ్ళ పుట్టింటినుండి తమ ఊరికి తీసుకుపోతున్నాడు అలా జరగటం మామూలుగా జరిగే పనే అయితే ఆయన అంతగా ఆందోళన చెందనవసరం లేదు. కాబట్టి ఇంటి దగ్గర ఎవరో ప్రమాద స్థితిలో ఉన్నారు. అంటే ఆ అమ్మాయి భర్త లేక అత్తగారు ఎవరయినా సరే ఆ ఇంట్లో. ఆ అమ్మాయిని తీసుకువచ్చేవాళ్ళు వేరెవరూ లేకపోవటంవల్ల ఆయన స్వయంగా బయలుదేరక తప్పలేదు. కోడలిని తీసుకువచ్చేటందుకు" చెప్పటం ఆపాడు అతడు.

బండి వస్తున్నట్టుంది. ప్రయాణీకులు అందరూ లేచి నిలబడ్డారు. సామాన్లు సర్దుకుంటున్న హడావుడి.

"మూడో పరిస్థితి?" అడిగాడు.

"చెబుతున్నాను— ఆ అమ్మాయికి ఆ ముసలాయన తండ్రి కాదు, మామగారుకాదు అన్నగారు కావటానికి వీలులేదు. ఎందుకంటే వయస్సు ఇద్దరి మధ్యా చాలా తేడా ఉంది. ఆమెను కలిపి ప్రయాణం చేయటంలో అర్థం ఆమె వెంట ఎక్కడికో పెద్దదిక్కుగా బయలుదేరాడన్న మాట ప్రయాణంలో. అలాంటి నమ్మకమూ చనువు ఉన్నాయంటే తప్పకుండా ఆయన ఆ అమ్మాయి తరఫు బంధువో లేక వాళ్ళ నాన్నగారి స్నేహితుడో అయి ఉంటారు. కూడా తోడుగావచ్చిన పెద్దమనిషి ఏదో విషయాన్ని గురించి బాధగా చెబుతున్నాడంటే కారణం ఏమై ఉంటుంది. తప్పకుండా అతని ఇంటి విషయాలే. అబ్బాయి ఉద్యోగం గురించో అమ్మాయి పెళ్ళి గురించో లేక వాళ్ళ గృహసంబంధమయిన ఒక విషయాన్ని గురించి చెప్పి బాధ పడుతున్నాడు.

ఇంకా ఎన్నో రకాల పరిస్థితులలో వాళ్ళున్నట్లుగా ఊహించుకోవచ్చు కానీ ఎక్కువ బలంగా నిలిచే పరిస్థితులు ఈ మూడే" అంటూ ముగించాడు అతను.

అప్పటికే బండి ప్లాట్‌ఫారమ్ మీదకు వచ్చింది. అతను ఎక్కాల్సిన బండి అదే. అందుకని అతను క్రింద ఉంచిన సంచీని చేతిలోకి అందుకుని—

"నేను వెళ్ళాల్సిన బండి ఇదే. రండి అక్కడనుంచుందాము" అన్నాడు.

కిటికీ లోనుంచి లోపలి సీటులో సంచీ ఉంచి నాకేసి తిరిగాడు.

"ఎలా ఉంది నా ఊహ?" అన్నాడు.

"బాగానే ఉంది" అన్నాను.

గర్వంగా నవ్వాడు అతను.

"నా ఊహ ఎప్పుడూ తప్పు అవదు. ఎంతగా ఆలోచించినా ఇంతకంటే బలమైన పరిస్థితి వాళ్ళకు ఉన్నట్టు తోచదుకదూ?"

గార్డు విజిల్ ఊదాడు.

"అన్నట్టు మీకు ఓ విషయం చెప్పటం మరిచిపోయాను" అన్నాను.

"ఏమిటి?" అడిగాను అతను.

"వాళ్ళు మాట్లాడుకుంటున్న భాష కన్నడం. అది నాకు తెలుసు" అతను ఆశ్చర్యంగా నాకేసి చూశాడు.

తను ఊహించిన మూడు పరిస్థితులలో ఏ పరిస్థితిలోనయినా వాళ్ళు ఉన్నారా అనే కుతూహలం అతని కళ్ళల్లో మెదలటం గమనించాను నేను.

"మీకో విషయంచెప్పవలసి వస్తున్నందుకు బాధగా ఉంది" అన్నాను తర్వాత. అతను ఏదో దెబ్బతిన్నట్టుగా చూశాడు నాకేసి.

"అవును— మీరు చెప్పిన మూడు పరిస్థితులలోనూ వాళ్ళులేరు. మీరు రచయితే కావచ్చు. కాని ఊహలు జీవితాలతో ఎప్పుడూ సరిపోవు. రచయితకు వివిధ దృక్కోణాల నుండీ పరిశీలించగల సామర్థ్యం, ఉండాలి అంటూనే మీరూ ఒకే కోణంలోనుండీ చూశారు వాళ్ళని. మీరు చూసిన కోణం ఆముసలాయన వైపేఉంది. ఆ అమ్మాయి ముఖభావాలు మీరుపట్టించుకున్నట్టు లేదు.'

శిథిలం

— మురళీ ప్రభాకర్

మనిషిగా ఆశలు కొల్లలు
మనసుకా లేని పోని ఎల్లలు
మమతలూ ఋణాలూ కోకొల్లలు
నిజానికివన్నీ ఎండమావులు, కల్లలు

ఇది నిత్యం జరిగే సృష్టి
ఏదీ లోపంలేని దృష్టి ?
ఒకడు నిత్య నికృష్టి,
ఒకడు నిరంతర కష్టి.

రేపేదో తెస్తుందన్న ఆశ
అది రాకపోతే నిరాశ
అక్షయమీ దురాశ
జీవితమొక అడియాస.

అతను బిత్తరపోయి చూస్తున్నాడునాకేసి.

'ఆ అమ్మాయి ముసలయన కూతురే. ఆ అమ్మాయి పెళ్ళిఅయి సంవత్సరంన్నర దాటింది. ఈమధ్య కాలంలో ఆమెభర్త ఆమెను సరిగా చూడలేదు. అతను పెట్టే బాధలు భరించలేని ఆమె పుట్టింటికి తిరిగి వచ్చింది వారం క్రితం కానీ ఎంత అయినా తండ్రి ప్రాణం కదా? కూతురు కాపురం ఎక్కడ పాడవుతుందోనని ఆయన బాధ. అందుకనే ఆ అమ్మాయికి ఎన్నోవిధాల నచ్చచెప్పి భర్తదగ్గరకు మళ్ళీ తీసుకుపోతున్నాడు. మళ్ళీ భర్తదగ్గరికి వెళ్ళి ఆ నరకంలో తాను పడటం ఆమెకు ఇష్టం లేదు. అందుకనే ముభావంగా కూర్చుని ఉంది. ఆ ముసలాయన ఇందాకటినుండీ చెబుతున్నది — అక్కడికి వెళ్ళినతర్వాత భర్తతో ఎలా మసలాలి? అనే విషయం, భర్తలేని స్త్రీని సమాజం ఎలా చూస్తుంది అనే అంశం."

రైలు బయలుదేరింది.

అతని ముఖాన నెత్తురుచుక్క లేదు.

అతనిమీద అతనికిగల నమ్మకానికి నా మాటలు పెద్ద దెబ్బ. అందుకనే అతనిలో అంత మార్పు. ఎందుకనో అతన్ని ఆ పరిస్థితిలో చూసిన తర్వాత ఒక్క క్షణంపాటు జాలికలిగింది.

అతను చిన్నగా నవ్వి — "అలాగా!" అన్నాడు.

అని అప్పుడే వేగం అందుకుంటున్న రైలులోకి ఎక్కేశాడు 'వస్తానంటూ —' ఆ క్షణంలో అతని ముఖంలో ఎన్నో భావాలు చదవగలిగాను నేను. తప్పుచేసి పట్టుబడిన వాడిలా చిన్నబోయింది అతని ముఖం. నవ్వలేక నవ్వాడు అంతే.

రైలు వేగం అందుకుని చూస్తుండగానే కనుమరుగైంది.

తిరిగివచ్చి ఇందాకటి స్థలంలోనే నుంచున్నాను మళ్ళీ. ఆ ముసలాయన ఇంకా చెబుతూనే ఉన్నాడు కన్నడంలో ఆ అమ్మాయికి. ఆమె తల వంచుకుని వింటూనే వుంది.

ఆ ముసలాయన మాటలు వింటుంటే నాకు నవ్వు ఆగటంలేదు. అవునుమరి ఆయన మాటల్లో ఒక్కముక్కకూడా నాకు అర్థం తెలీదు.

# హైదరాబాద్ నోట్ బుక్ —తిరుమల రామచంద్ర

## శ్రీ పాలగుమ్మి విశ్వనాథానికి సన్మానం

ఆకాశవాణి హైదరాబాద్ కేంద్రంలో లలిత సంగీత దర్శకుడుగా వున్న శ్రీ పాలగుమ్మి విశ్వనాథం రెండు దశాబ్దాలుగా లలిత సంగీతంలో నూతన ప్రక్రియలు కల్పిస్తూ జనాన్ని ఆనందపరుస్తున్న సందర్భంగా రామచంద్రాపురం భారత్ హెవీఎలెక్ట్రికల్స్ సాంస్కృతిక సంస్థ శ్రీవాణీ లలిత కళారంజని జూన్ రెండవ వారంలో సన్మానించింది. సన్మాన సభకు అధ్యక్షత వహించిన డాక్టర్ శ్రీమతి కనకవల్లి నాగేంద్ర శ్రీ విశ్వనాథం సంగీత శాస్త్రజ్ఞతను, వ్యక్తిగత గుణాలను ప్రశంసించారు. విశ్వనాథం లలిత సంగీత రంగంలో చేసిన కృషిని వాగ్గేయకారుడుగా సంపాదించిన వైశిష్ట్యాన్ని సికిందరాబాద్ సంగీత కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ నూకల చినసత్యనారాయణ వివరించారు. శ్రీ విశ్వనాథం కృతజ్ఞత తెలుపుతూ నేను ఉదయశంకర్ బృందంలో పనిచేస్తున్న సమయంలో శ్రీ విష్ణుదాస్‌షిరాలీ అనే సంగీత విద్వాంసుడు సృష్టించిన వాద్యబృందం ఫక్కీలోని మెలుకువలను శ్రద్ధగా ఆకళించుకొన్నాను అన్నారు. తర్వాత జరిగిన లలితసంగీత కార్యక్రమంలో శ్రీమతి శారదాఅశోకవర్ధన్ రచించిన మనసాయెరా మాధవా ? అనే గేయాన్ని శ్రీమతి విజయలక్ష్మీ శర్మ మనోహరంగా పాడారు.

## సాహిత్యక్షేత్రంలో నవధాన్యాలు

ప్రముఖ పత్రికా రచయిత శ్రీ రాఊరి వేంకట సత్యనారాయణరావు ఇటీవల యువభారతివారి సమాలోచనం మొదటి సమావేశంలో సాహిత్యక్షేత్రంలో నవధాన్యాలు అనే విషయంపై ప్రసంగిస్తూ సాహిత్యం జీవనది వంటిదని, అది సమాజంలో అంతర్వాహినిగా ప్రవహిస్తుందని అన్నారు. ఆధునిక నాటక రంగంలో ఆధునిక ప్రయోగం అనే అంశంపై సుప్రసిద్ధ రంగస్థల నటుడు రంగస్థలశాస్త్రజుడు శ్రీ ఎ. ఆర్. కృష్ణ ప్రసంగిస్తూ, తెలుగు నాటకరంగం ఇంకా ఎంతో ఎదగాలని అన్నారు. యువభారతి అధ్యక్షులు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి సమావేశానికి అధ్యక్షత వహించారు.

## కట్నంలేని పెళ్ళికి వేదిక

ప్రస్తుతం అందర్నీ వేధిస్తున్న వరకట్నం సమస్యను పరిష్కరించే ఉద్దేశ్యంతో కట్నంలేని పెళ్ళికి వేదిక అనే సంస్థ రాజధానిలో నెలకొన్నది. పలువురు కట్నాలకు విముఖులైనా ఒంటరిగా ఎవరికివారు ఏమీ చేయలేక పోతున్నారు. అలాటి వారికి ఒక వేదిక ప్రారంభించి, ప్రోత్సహించడం ఈ సంస్థ లక్ష్యం. కట్నాల సమస్యకు ఆచరణీయమైన పరిష్కారం చూపడం ఈ సంస్థ ఆశయం. ఈ సంస్థ బహు వివాహాలు జరిపింది. కట్నం లేకుండా పెళ్ళిచేసుకో దలచినవారు తమ పేరు, చిరునామా, వయస్సు, చదువు, ఉద్యోగం, తెలిసిన భాషలు, అభిరుచులు కావలసిన మనువులు మొదలైన వివరాలు ఫోటోతో సహా కార్యదర్శి, కట్నంలేని పెళ్ళికి వేదిక, సి155, మలక్‌పేట కాలనీ బిబాక్స్, హైదరాబాద్—36 (—500036)తో ఉత్తర ప్రత్యుత్తరాల జరుపవచ్చు. ఈ సంస్థకు అధ్యక్షులు ప్రఖ్యాత కవి శ్రీ కుందుర్తి ఆంజనేయులు, ఉపాధ్యక్షులు ప్రఖ్యాత రచయిత, సంఘ సంస్కర్త, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సాంస్కృతిక శాఖ ప్రత్యేకాధికారి డాక్టర్ అంతటి నరసింహం, కార్యదర్శి శ్రీ వి. మధుసూదనరావు.

## శ్రీ బ్రహ్మానందరెడ్డి ఉద్బోధ

అఖిలభారత కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జూన్ 1వ తేదీన ఇక్కడికి వచ్చినప్పుడు పౌరులు బేగంపేట విమానాశ్రయంలో ఘన స్వాగత మిచ్చారు. శ్రీ రెడ్డి గాంధి భవన్‌లో కాంగ్రెస్ కార్యకర్తల సమావేశంలో ప్రసంగిస్తూ, కాంగ్రెసు పార్టీలో సమైక్యాన్ని కలిగించి, ప్రజల విశ్వాసం చూరగొనడానికి కృషి చేయాలని ఉద్బోధించారు. పూర్వం కాంగ్రెసు పార్టీకి ఉన్న నైతిక మూల్యాలను పునరుద్ధరించాలని, కాంగ్రెసు కొన్నిచోట్ల ఓడిపోయినంత మాత్రాన నిరాశ పడవలసిన అవసరం లేదని ఆయన అన్నారు.

## ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభ

ద్వితీయ తెలుగు మహాసభ మలేషియాలోని కౌలాలంపూర్‌లో 1978 ఏప్రిల్ 8వ తేదీనుంచి 13వ తేదీవరకు ఆరు రోజులపాటు జరుగుతుందని విద్యామంత్రి శ్రీ ఎం. వి. కృష్ణారావు తెలిపారు. ఈ మహాసభను మలేషియాలోని ఆంధ్ర సంఘం నిర్వహిస్తుంది. అంతర్జాతీయ తెలుగు సంస్థ దానితో సహకరిస్తుంది. మనదేశం నుంచి 250 మంది ప్రతినిధులు వెళ్ళుతున్నారు. వీరిలో 200 మంది ఆంధ్రప్రదేశ్ వారు. రాకపోకలకు దాదాపు ఐదువేల రూపాయలవుతుంది. ప్రతినిధులే ఈ ఖర్చును భరించాలి, వెళ్ళదలచుకున్నవారు అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరక్టర్ కార్యాలయంలో తమపేరు నమోదుచేయించుకోవాలి.

## ఉపశ్రుతి

మీ పత్రికలో చాలా తప్పులు పడుతున్నాయిసార్ అన్నాను ఒక పత్రికా సంపాదకునితో. బాగా చెప్పారు అంతగా పదిసార్లు పర్యవేక్షించే ప్రభుత్వం రికార్డులలోనే తప్పులుండగా అవసర నైవేద్యాలు పెట్టే పత్రికల గురించి చెప్పవచ్చారూ? అని ఎత్తి పొడిచాడు ఆ సంపాదకుడు. స్వామీ, కరెన్సీ నోట్లలోనూ ముద్రారాక్షసాలు దొర్లేకాలం దూరంలో లేదు అని చమత్కరించారు మిత్రులు శ్రీ దాగంటి కపిలేశ్వరరావు ప్రముఖ లలితకళా విమర్శకులు. ●



సీరియల్

# తమసోమా జ్యోతిర్గమయ



ఎం.పి.ఆర్. రాధాకృష్ణ

*(గత సంచిక తరువాయి)*

ఇది తవరకూ డబ్బుగురించి ఆలోచన. దానికో పరిష్కారమార్గం కనిపించిం దనుకునేసరికి ... ఈ అవాంతరం. ఈ సంబంధం తప్పిపోతున్నదనే బాధే కాకుండా ... ఈ విషయం నలుగురికీ తెలిస్తే... మరిహ సంబంధాలు రావేమో నని... భయం!

సుజాత నైజం చలపతిరావుకు బాగా తెలుసు. బలవంతంచేస్తే మరింత మొండి కేస్తుంది. ప్రస్తుతానికి సమస్య పట్టు సడలించి, తరువాత నెమ్మదిమీద సమాధాన పరచాలి.

చూడమ్మా. మనమింకా అనుకోవడమే గానీ, ఏవిషయం నిర్ధారించుకోలేదు. వాళ్ళ దగ్గర నుండి కబురంటూ వకటి వచ్చింది కాబట్టి, ఈచర్చ! నీకిష్టం లేదంటే.. అసలు చర్చేలేదు దానికింతరాద్ధాంతం దేనికి? నెమ్మది మీద మాట్లాడుకోవచ్చు. దానికి కావసినంత సమయముంది...'' అన్నాడు.

"మీరు, మరీనూ! ఇలా గారాబంచేసే దాన్ని నెత్తినెక్కించుకున్నారు అది పెళ్ళి వద్దనడమూ బాగుంది. మీరు వంత పాడడం బాగుంది. అదికనుక ఈ పెళ్ళికి అంగీకరించక పోతే.. నేను బావిలో దూకి చస్తాను.. జాగ్రత్త..." అంటూ శివమెత్తినట్లు గట్టిగా అరిచింది కామాక్షమ్మ!

ఆమెను సమాధానపరిచేసరికి.. చలపతి రావు తలప్రాణం తోక్కికొచ్చింది.

"నువ్వు కూడా తొందర పడితే ఎలా? అదేమో చిన్నపిల్ల. దానియిష్టం కాదంటే.. అదిమాత్రం బాధపడదూ! ఏదైనా సమస్య వచ్చినపుడు సహనంతో పరిష్కరించుకోవాలి గాని.. పంతాలకుపోయి పాడుచేసుకుంటామా? దేనికయినా ఘటన ఉండాలి. ఏది ఎక్కడ వ్రాసి పెట్టి ఉందో! మనచేతుల్లో ఏముంది?" అన్నాడు కామాక్షమ్మకు సర్దిచెప్తూ.. దానికి కాస్త వేదాంతాన్ని కూడా జోడించి.

అక్కడితో, ఆ ప్రస్తావన ముగిసినా.. అందరి మనసులలో వెలితిమాత్రం మిగిలి పోయింది.

"మంచిపని చేశావే! నీ ధైర్యానికి నా జోహార్లు'' అంది అరుణ సుజాత చెప్పిన దంతావిని.

"నిజంచెప్పు సుజీ! మొదటి నుండి ఈ సంబంధం నీకు యిష్టంలేదు. ఔనా?'' అంటూ అడిగింది రజని.

"ఇష్టంలేకపోవడంకాదు, రజనీ నేనెవరినీ ప్రేమించలేదు. ఎవరిని ప్రేమించాను గనుక ఈ సంబంధాన్ని కాదనడానికి! కట్నాల గురించి కూడా ఏనాడూ పెద్దగ లోచించ లేదు నేను. నాకు నావంటూ ఏ అభిప్రాయాలు లేవు. నిజం చెప్తున్నాను. ఒకవేళ వాళ్ళు తక్కువకట్నానికే అంగీకరించి ఉంటే నేను కూడా ఈ పెళ్ళికి వప్పుకుని ఉండే దాన్నేమో! కానీ ఈ పెళ్ళికోసమని, వాళ్ళడిగిన కట్నం యివ్వడానికని మా నాన్నగారు ఉన్న ఒక్క యిల్లూ అమ్మేయడానికి సిద్ధపడ్డారు. అమ్మ, అన్నయ్యలు కూడా సరే అన్నారు. అదేదో సర్వసాధారణమైన విషయమైనట్లు.

"ఒక్క ఆడపిల్ల పెళ్ళి చేయడానికే ఉన్న దంతా అమ్ముకుంటే ముగ్గురో, నలుగురో ఆడపిల్లలున్న మధ్యతరగతి కుటుంబీకుల గతి ఏమిటి? కట్నాలు యివ్వడం, పుచ్చుకోవడం ఏ విధమైన ఆచారమో నాకు తెలీదుకాని ఆడపిల్ల పెళ్ళిచేసి, ఆ కుటుంబం దివాళా తీయడంమాత్రం ఆత్మహత్యతో సమానం. ఈనాడు నీడనిచ్చే యిల్లమ్ముకొని రేపు రిటైరు అయ్యాక ఎక్కడుంటారు? ఈనాడు నా పెళ్ళికి చేసినఅప్పులే జీవితాంతం తీరుస్తూ కూర్చుంటే, చివరకు వాళ్ళకు మిగిలేదేమిటి? ఇవే నేను ఆలోచించాను. కేవలం ఈ కారణాలవల్లనే నేను వివాహానికి యిష్టపడలేదు'' అంది సుజాత.

"పాపం మీ అమ్మగారు, నాన్నగారు చాలా బాధపడి ఉంటారు.'' అంది రజని.

"అందుకని జీవితాంతం మనం బాధ పడాలా? పెద్దవాళ్ళ కోసమని ఈనాడు దేన్నయితే త్యాగంచేశామో తీరా ఆ పెద్దవాళ్ళు పోయాక అది తిరిగి రమ్మన్నారాదు. ఇష్టంలేనిపని చేయడం మూర్ఖత్వం ... ఐ డోంట్ లైకిట్''అరుణ తీవ్రంగా అంది.

"పెద్దవాళ్ళు ఏది చేసినా.. మనసుఖ సంతోషాలు మనసులో పెట్టుకుని చేస్తారు.'' సుజాత, అంది."మనం కాదంటే. తప్పకుండా బాధపడతారు. నా పెళ్ళికోసం, సర్వస్వాన్ని వదులుకోడానికే సిద్ధపడ్డారంటే. అది మన మీద వాళ్ళకున్న అభిమానానికి, ప్రేమకు నిదర్శనం. 'మనసంగతికేం. అమ్మాయి సుఖపడితే చాలు.' అనే భావనే. వాళ్ళను ఇంత త్యాగానికి పురికొల్పింది. కానీ, ఆడపిల్లను కన్న నేరానికి వాళ్ళు అడుక్కుతినిపోకూడదు. నిజమే. వాళ్ళ మాట వింటే. మన బతుకులు సాఫీగా, హాయిగా వెళ్ళి పోవచ్చు. కానీ. వాళ్ళగతేమిటి? శక్తికి మించిన అప్పులుచేసి కూతురికో మొగుడ్ని కొనాలనుకుంటే ఆడపిల్ల చూస్తూ వూరుకోవాలా? కూతురి భవిష్యత్తుకోసం తమ భవిష్యత్తునే బలిచేసుకొంటూంటే దాన్ని తెలిసీ సహించాలా?

"నాన్నగారు ఎంతో బ్రతిమాలారు. అమ్మ ఏడ్చి సాధించాలనుకుంది. అన్నయ్యలు సరిగా మాట్లాడ్డం మానేశారు. ఇవన్నీ చూసిన తరువాత 'పోనీ వాళ్ళమాటే వింటే సరిపోతుంది' అని రెండు మూడుసార్లు అనిపించింది కూడా! మనం వాళ్ళ మాట కాదంటే మన చుట్టూ చక్రబంధాన్ని బిగించి ఒప్పించాలని చూస్తారు, ఈ పెద్దవాళ్ళు! మా వీధి జనాలు వింతగా చూస్తున్నారు. నావైపు. నే నెవరినో ప్రేమించానని

---

***జరిగినకథ 2*** చలపతిరావు, కామాక్షమ్మలకు సుజాత ఒక్కతే కూతురు. సుజాత పెద్దన్న రామం ఉద్యోగంలేక, చిన్నన్న మురళి నాటకాల పిచ్చితోను తిరుగుతుంటారు సుజాత, అరుణ, రజని క్లాస్‌మేట్స్. అరుణ టెన్నిస్ ఆడే శేఖర్‌ని ప్రేమిస్తుంది. తన పెళ్ళికి కట్నంకోసం ఇల్లమ్మాలనుకోవటంతో అసలు పెళ్ళే చేసుకోనంటుంది సుజాత.

---




అందుకే ఈ సంబంధాన్ని కాదన్నానని, వో కట్టుకథ కూడా ప్రచారంలో వుంది. నాకూ బాధగానే ఉంది అయినా ఓర్పుగా సహిస్తున్నాను. ఎందుకో తెలుసా? నేనేమీ తప్పు చేయలేదనే తృప్తి నాకుంది. అది చాలు నాకు ఈ సమస్యను కాలమే పరిష్కరిస్తుంది!''

సుజాత చెప్పడం ఆపి బరువుగా నిట్టూర్చింది.

*　　*　　*

ఆ తరువాత ఆ విషయాన్ని ఇంకెవరూ ప్రస్తావించలేదు చలపతిరావు ఒకటి రెండు సార్లు సుజాతను కదిపిచూసి లాభంలేదని తెలుసుకున్న తరువాత తన ప్రయత్నాన్ని విరమించుకున్నాడు.

మరో మూడు నెలలు కాలగర్భంలో కలిసి పోయాయి! ఈ మూడు నెల్లో చెప్పుకో దగ్గ మార్పులు ఏవీ రాలేదు. రామం ఇంకా నిరుద్యోగిగానే ఉన్నాడు.

మరో రెండు పరిషత్ పోటీల్లో బహుమతులు గెల్చుకున్నాడు మురళి!

కామాక్షమ్మ కొకసారి, చలపతిరావుకు మరోసారి, ఫ్లూ జ్వరం వచ్చి తగ్గిపోయింది

కాకపోతే వాతావరణంలో మాత్రం కొద్దిగా మార్పు వచ్చింది. వర్షాలు తగ్గి చలి మొదలయింది.

ఇంటా, బయట కూడా సుజాతపట్ల బిగువుతగ్గి క్రమంగా సాధారణ పరిస్థితి తిరిగి వచ్చింది.

*　　*　　*

ఆ రోజు కాలేజీకి బయలుదేరే ముందు సుజాత తండ్రిని ఓ పాతిక రూపాయలు కావాలంటూ అడిగింది.

''ఈ నాళ అరుణ పుట్టినరోజు. మా అందరినీ పార్టీకి ఆహ్వానించింది. ఏదైనా ప్రజంటేషన్ కొందామని'' అంది. తను డబ్బు అడగడానికి కారణాన్ని వివరిస్తూ!

## తమసోమా జ్యోతిర్గమయ

చలపతిరావు డబ్బుతీసి యిచ్చి "బాగా చదువుతున్నావా? క్లాసు రావాలి మరి" అన్నాడు.

ఇంతకాలంలోనూ ఇదే మొదటిసారి. ఆయన సుజాత చదువు గురించి పట్టించుకోవడం.

సుజాత తల ఊపి కాలేజికి వెళ్ళిపోయింది.

అరుణ ఇంటిలో...

ఆనాటి పుట్టినరోజు పార్టీ చాలా పెద్ద ఎత్తునే ఏర్పాటు చేశారు

అరుణ తండ్రి మాధవరావుగారితో వ్యాపారరీత్యా సంబంధమున్నవాళ్ళు, అరుణ స్నేహితురాళ్ళు, అరుణ తల్లి శాంతాదేవిగారి మహిళామండలి బృందం అంతా వెరసి ఓ వంద పైగానే ఉన్నారు, ఆహూతులు.

వస్తున్నవారిని సాదరంగా ఆహ్వానించి, కూర్చోబెడుతున్నారు, మాధవరావుదంపతులు.

స్నేహితురాండ్ర మధ్యచేరి మాట్లాడుతున్నదన్న మాటేగాని అరుణ దృష్టి మాటిమాటికి గుమ్మంవైపే తిరుగుతూంది. ఆమె అన్యమనస్కతను గమనించిన రజని చిన్నగా నవ్వి "నన్నలా విధిమలుపునరకూ వెళ్ళి రమ్మంటావేమిటి?' అంటూ అడిగింది.

"దేనికి?" అరుణ ఆశ్చర్యంగా అడిగింది.

"రాబోయేవారికి స్వాగతం పలకడానికి..."

రజని మాటల్లోని కొంటెతనాన్ని గ్రహించిన అరుణ సిగ్గుపడి... "ఇంకాసుజాత రాలేదు..'' అంది.

"శేఖర్ కూడా..."

అతనికి నూరేళ్ళాయుష్షన్నట్లు అప్పుడే గుమ్మంవగ్గర కనిపించాడు.

అరుణ.. ఒక్కఉదటున అక్కడకు చేరుకొని.. "రండి. రండి.. మీకోసమే చూస్తున్నాను.." అంటూ ఆహ్వానించింది. శేఖర్‌ను తండ్రి దగ్గరకు తీసుకువెళి .. పరిచయం చేస్తూ..

"మాకాలెజి టెన్నిస్ ఛాంపియన్..." అంది.

"ఐసి! చాలా సంతోషం, అమధ్య అమ్మాయి చెప్పింది.. మీగురించి.." అన్నారు మాధవరావుగారు, చేయిచాచి.

శేఖర్ చేయి అందుకొని,కరచాలనంచేస్తూ, "మిమ్మల్ని కలుసుకోగలినందుకు ఆనందంగా ఉంది..." అన్నాడు.

తప్పక చూడండి!







లావణ్య పిక్చర్స

# గంగ-యమున-సరస్వతి

మహేష్

VIJAYA

విజయా పిక్చర్స్

"మీరుమాట్లాడుతూ ఉండండి.' అనిచెప్పి మాధవరావుగారు అప్పుడే వచ్చినస్నేహితు డొకాయనను పలకరించేందుకు వెళ్ళారు

"మీరలా కూర్చోండి. ఇప్పుడేవస్తాను.." అంది అరుణ, నవ్వి!

"నువ్వువెళ్ళి పోతావా?"

"లేక.. మీదగ్గరే కుర్చోమన్నారా! నయం అందరూ ఉన్నారు." అంది, అరుణ!

"ఆఁ.ఉంటే ఉండనీ....." అంటూ గుమ్మం వైపు చూసి మాట సగంలోనే ఆపేశాడు, శేఖర్!

అరుణ కూడా గుమ్మంవైపు చూస్తే... అప్పుడే వచ్చిన సుజాత కనిపించింది.

"జస్ట్ ఏ మినిట్" అని సుజాతను వడి వడిగా చేరుకుని, "ఏమే ఇప్పుడా రావటం?" అంటూ అడిగింది అరుణ!

"సారీ కొంచెం లేటయింది. మనవా ళ్ళంతా వచ్చినట్లేనా?" చుట్టూ చూసి అడిగింది సుజాత!

"ఎప్పుడో వచ్చాం చిట్టితల్లీ! నువ్వింకా రాలేదేమా అని చూస్తున్నాం. బెంగతీరింది" అంది రజని అప్పుడే అక్కడకు వచ్చి!

"బెంగ దేనికి?" సుజాత నవ్వింది.

"ఏమో ఏ గడుగ్గాయో తన్నుకు పోతాడని"

"ఛీ పోర్మయ్యి" అరుణ నవ్వుతూ కసిరింది.

"ఏమిటో దెబ్బలాడుకుంటునట్లున్నారు" అన్నాడు శేఖర్ కూడా అక్కడ చేరి!

## తమసోమా జ్యోతిర్గమయ

మీరు మధ్యవర్తిత్వం నెరవేర్చనక్కరలేదు లె. డి. ప్రసు తానికి యుద్ధం నాకు సుజాతకు అంది రజని!

"అసలు ఆడవాళ్ళ తగవుల్లో తల దూర్చనే కూడదన్నారు" శేఖర్ అన్నాడు.

"ఎవరబ్బా అంత గొప్పగా సెలవిచ్చారు"

"పెద్దలు"

"వాళ్ళకివే నా జోహార్లు. కావాలంటే మీకూ్కడా!"

"బాబోయ్. అప్పుడే నన్ను పెద్దల్లో కలిపేయకండి! నాలుగు కాలాలు బ్రతకా లనుంది" శేఖర్ నవ్వాడు!

అరుణ కూడా నవ్వింది. "ఒక్కక్షణంలో వస్తాను. మీరుమాట్లాడుతూవుండండి"అని మాధవరావుగారి దగ్గరకు వెళ్ళింది.

"చూడండి శేఖర్‌గారూ! మీతో మాట్లా డుతూ కూర్చుంటే, అక్కడ మాఅమ్మాయి లంతా నన్నుమర్చి తిట్టిపోస్తారు. అందుకని ప్రస్తుతానికి శలవ్" అంటూ రజని కదల బోతే సుజాత కూడా ఆమెను అనుసరించింది

"ఇది చాలా అన్యాయం. నన్నొక్కడిని వదిలేసి వెళ్ళిపోతున్నారు" అన్నాడు శేఖర్!

"అయితే మీరూరండి. మాతో కలిపేసు కుంటాం" అంది రజని.

రజని మాటలకు సుజాత నవ్వింది.

"అమ్మయ్య ముత్యాలు రాలాయి"అన్నాడు శేఖర్.

"నవ్వితే రాలేవి నవరత్నాలు సార్! ముత్యాలు కావు" అంటూ నవ్వింది రజని.

"పరవాలేదు రెండూ ఒకటే. ఎటొచ్చి చూసేవారి అభిరుచినిబట్టి ఆధారపడి ఉంటుంది" అన్నాడు శేఖర్ గమ్మత్తుగానవ్వి.

"సరే! మీ అభిరుచుల గురించి చర్చించే తీరుబడిలేదుమాకు. ఇప్పటికే మావాళ్ళు మింగేసేలా చూస్తున్నారు, వెళ్తాస్తాం" అంటూ దారితీసింది రజని.

రజని వెనకాలే వెళ్తున్న సుజాతలో ...

"ఒక్కమాట..." అన్నాడు శేఖర్.

ఏమిటన్నట్లు చూసింది ఆగి.

రజని అప్పటికే మిత్రబృదంతో కలిసి పోయింది. శేఖర్ చుట్టూ చూసి రహస్యంలో చెప్తున్నట్లు అన్నాడు: తిరిగి వెళ్ళేటపుడు ఒక్క అయిదునిమిషాలు బస్‌స్టాప్‌లో వెయిట్ చెయ్యండి. మీతో ముఖ్యమైన విషయం చెప్పాలి."

'ఏమిటది' అని సుజాత అడగాలనుకుంది గాని ఆమెకాఅవకాశం యివ్వకుండా అక్కడి నుండి వెళిపోయాడు శేఖర్. ఒక్కక్షణం నిలబడి నెమ్మదిగా మిత్రబృందాన్ని చేరుకుంది సుజాత. రజని మిగిలినవాళ్ళతో ఏదో తీవ్ర మైన చర్చలోఉంది.

సుజాత ఒక్కసారి అంతా పరికించి చూసింది.

ఎవరిగొడవల్లో వాళ్ళున్నారు. మాధవరావు గారు, శాంతాదేవి, అరుణ అతిధిమర్యాదల్లో ఉన్నారు. శేఖర్ ఎవరితోనో మాటాడుతూ క్రీగంట తనవైపే చూస్తున్నాడు. సుజాత, తనవైపు చూడగానే చిన్నగా నవ్వాడు.

చూపు చటుక్కున మరల్చుకొని ఏంచేయాలో తోచనట్లు దగ్గరలోఉన్న కుర్చీలో కూలబడింది.

శేఖర్ ఏ విషయమై తనతో మాట్లాడా లన్నాడో ఎంత ఆలోచించినా అంతుచిక్కడం లేదు.

అరుణ విషయమై అనుకుంటే, తనతో మాట్లాడి అతను ప్రత్యేకంగా సాధించేదేం లేదు

అది కానప్పుడు తనతో మాట్లాడవలసి నంత ముఖ్యమైన విషయాలేమున్నాయి. అతనికి!

మనసులో ఏదో మూల చిన్న అను మానం!

(36 వ పేజీ చూడండి)



# ఒక నిజమైన కథ

మైదా వెంకటరమణారావు

(గత సంచిక తరువాయి)

నానుష్యులు ఆగ్రహావేశులై ఉన్నప్పుడు, దాంతో కూడా భయం మిళితమై వున్నప్పుడు జ్ఞానం నశిస్తుంది. ఆ ఫోటోలేమిటో ఎవ్వరూ చెప్పటం లేదు. పెద్దక్క దాచేసింది వాటిని అమ్మకీ, బావలకి చూపి. ఇంటి తలుపులన్నీ వేసేరు పక్కింటివాళ్లు రాకుండా. అక్కని తీసుకొని ఇంకో గదిలోకి వెళ్లిపోయేరు. నేను పెద్దక్క దగ్గరికివెళ్లి ఆమెనిపక్కకి పిలిచి అడిగేను. "ఏమిటే అక్కా ఉంది ఆ ఉత్తరంలో?"

"ఏముంది? ఉండవల్సిందంతావుంది. నీ అక్కకీ పన్నవకుమార్‌కీ అక్రమ సంబంధం వుండేది. ఇద్దరూ జులాయిగా తిరిగేరు—మీ అక్క నెలతప్పితే ఒక లేడీడాక్టర్‌చేత ట్రీట్‌మెంట్ చేయించుకుందిట. ఆ డాక్టరుపేరుకూడా డైరీలో వుంది..."

నే అన్నాను. "అన్నీ అబద్ధాలే పెద్దక్కా ... అతనిమాటలు నమ్మకండి—ఆ ఉత్తరం ఆకాశరామన్న లేఖ..."

"అతనికేం పట్టిందే? ఇలాటి వుత్తరం పుట్టించడానికి?"

"పెళ్లి తప్పించుకుందుకే!"

"ఎందుకే, పెళ్లితప్పించుకోవాలి? అందులోనూ వాళ్ల తల్లిదండ్రులతోకూడా సంప్రదించేకే నిశ్చయమయిందికదే?"

"మరో అమ్మాయి వెంటపడి వుంటాడు. వాళ్లు ఎక్కువ కట్నం ఇస్తామనుంటారు!"

"ఓ పెద్దమనిషిని పట్టుకొని ఆ మాటలేమిటే? ఇన్నీ చూసీకూడా ఇప్పుడన్నా మనం ఊం అంటే అక్కని పెళ్లాడ్డానికి తయారుగావున్నాడే? ఆ ఫోటోలు, ఈ డైరీపేజీలూచూసేక చీమూ నెత్తురువున్న ఏ మగాడన్నా మీ అక్కకి పుస్తె కడతాడుటే? అతనింకా తగుమనిషికాబట్టి మన దగ్గరికొచ్చేడు అవి పట్టుకొని."

"ఏదీ ఆ ఫోటోలు చూడనీ..."

"ఏం చూస్తావే? సిగ్గు సిగ్గు. ఇంత సిగ్గు లేనితనం సానిముండకన్నా వుంటుందిటే?"

అక్క చేతిలో వున్న కవరు తీసుకున్నాను. ఆ ఫోటోలు తీసి చూసేను. త్రుళ్లిపడ్డాను సిగ్గుతో నా ఒళ్లు కుంచించుకపోయింది. అవి నాలుగు నగ్నంగా తీయించుకున్న ఫోటోలు అక్కవి. హోటల్ గదిలో వివిధ భంగిమలలో ఫ్లాష్‌తో తీసినవి. అందులో అక్క ఒంటరిగా వుంది. ఆమె పక్కని ఏ మగాడూ లేడు. అందులో అక్క సిగ్గుపడుతోంది. సిగ్గుతో నవ్వుతోంది — కాబట్టి అవి ఆమె యిష్టానికి వ్యతిరేకంగా తీసినవికావు. ఆమెని ఆ స్థితిలో చూసినవాడేకదా ఆ ఫోటోలు తియ్యగలడు? నాకు అర్థమయింది. ఈ పని రంగారావు చేసేడనటంలో సందేహంలేదు — కాని అలా అని నేను చెప్పినా, అక్క చెప్పినా ఎవ్వరూ వినరు.

అక్కతో మాట్లాడదామని వేరేగా పిలిచేను — అక్క రాలేదు. నాకేసి కోపంగా చూసింది — ఇందులో నా ప్రమేయం వుందనే దాని అనుమానం. కాని తరవాత పెద్దక్క అక్కకా ఫోటోలు చూపినప్పుడు అక్క చరచరా పీధి గదిలోకి వెళ్లి అరిచింది ... "రంగా! నువ్వింత నీచానికి పాల్పడతావా! ఆ ఫోటోలు తీసింది నువ్వేకదూ? పుస్తె కట్టకపోయినా మన మిద్దరం భార్యాభర్తలమే అని నువ్వనలేదూ? నా అందాన్ని ప్రతిక్షణం చూసుకోవాలని నువ్వే నీ కెమెరాతో తియ్యలేదూ? నువ్వే వాటిని డెవలప్‌చేసి, ఎన్లార్జ్ చెయ్యలేదూ? నేను నెల తప్పితే నువ్వేకదూ ఆ లేడీ డాక్టర్ దగ్గరికి వెళ్లమన్నావ్? ఎవరా శిశువు తండ్రి అని ఆమె అడిగితే ఆర్మీలో చేసి చచ్చిపోయిన పన్నవకుమార్ పేరు చెప్పమన్నావ్ ... అలాఅయితే మరి ప్రశ్నలు వెయ్యకుండా ఆమె ఎబార్షన్ చేస్తుందని ఎందుకు నువ్వీ నాటకం ఆడుతున్నావ్? నన్ను పెళ్లాడాలని లేకపోతే అలా చెప్పరాదూ? నా పేరెందుకు రచ్చకీడుస్తున్నావ్? నేను అందరిలోనూ తల యెత్తుకోలేకుండా యెందుకు చేస్తున్నావ్?"

అక్క యీ మాటలు అంటూవుంటే నిజం అంతా తేటతెల్లంగా నాకు కనిపించింది. కాని నేను యీ పరిస్థితిలో ఏం చెయ్యగలను?

అక్క మాటలకి రంగారావు విషాదంగా నవ్వేడు. "ఈ పనులన్నీ చేసింది నేనేఅయితే యెంత బాగుణ్ను అని అనుకుంటున్నాను సంధ్యా! అప్పుడు నాకీ మనఃక్లేశం, యీ బాధ, యీ తలవంపులు వుండకపోను. ఇప్పుడన్నా నేను పుస్తె కట్టడానికి తయారుగానే వున్నాను, మీరందరూ అదే సరైనపని అని నిర్ణయిస్తే. కాని పెళ్లయిన మరుక్షణంనించి మనం పేరుకే భార్యాభర్తలగా వుంటాంకాని నిజమైన సామరస్యం వుంటుందా చెప్ప? నీకు పుస్తె కట్టకపోతే నా పరువు ప్రతిష్టలుకూడా ఏం కావాలి? నా స్నేహితులు అడుగుతే ఏం చెప్పాలి? తప్పంతా నామీదేకదా వేసుకోవాలి?"

"ఏమే సంధ్యా! అతన్ని తప్పపడుతున్నావేమే సిగ్గులేకుండా నువ్వు చేసిన పని చాలక అతని పరువుకూడా గంగలో కలుపుదామని చూస్తున్నావా?" అమ్మ అడిగింది.

రంగారావుకేసి కాల్చేసేటట్లు చూసేను. కాని అతను నాకేసి చూడలేదు

"మీరేం చెయ్యమంటే అదే చేస్తాను. ఆట్టే సమయంలేదు. మావాళ్లంతా యెల్లుండి వస్తారు— ఏర్పాట్లు అవీ చేసుకోవాలి..."

"ఇంకెందుకు బాబు యేర్పాట్లు? మీవాళ్లకి టెలిగ్రాం ఇచ్చి పెళ్లి ఆగిపోయినట్లు. పీటలమీద పెళ్లిళ్ళే ఆగిపోతున్నాయి." అమ్మ తన నిర్ణయం తెలిపింది.

"లేదండీ! మీ కుటుంబం పేరు ప్రతిష్టలు నిలబెట్టవల్సిన బాధ్యత నాకూ వుంది. మీ ఇంట్లో పెళ్లి ఆగిపోవడం ఏ మాత్రం భావ్యంకాదు ..." అన్నాడు లేచినవాడు కూర్చుంటూ మళ్లా.

పెద్దబావ వచ్చిఅడిగేడు ... "అయితే ఏం చేద్దామంటారు?"

"నేనేదో త్యాగంచేస్తున్నానని అనుకోపోతే ఒక మాట చెప్తాను, ఆంతరంగికంగా."

"తప్పకుండా... ష్యూర్...ష్యూర్ ... రండి. లోపలిగదిలోకి వెళ్దాం..."

అందరూ కలిసి మరో గదిలోకివెళ్లి తలుపు బిగించేరు.

అందరూ వెళ్లేక అక్క నాకేసి చూసి అంది — "ఈపనికి దేవుడు నిన్ను శిక్షిస్తాడే — దేవుడు నిన్ను వదలడే — నువ్వు యీ జన్మలో నే శిక్షని అనుభవిస్తావే!"

"ఏమిటక్కా నువ్వంటున్నది? నేనేం చేసానే?"

"నువ్వూ వాడూ కలిసేకదూ నాటకం ఆడేరు?"

"లేదు. లేదక్కా ఆ మాట అనకు — అంతా తెలుస్తే నువ్వీమాటలనవు. నే చెప్పేది విను..."

"నేనేం వినను. నువ్వు రాక్షసివి. ఆడదానివి కావు..." అంటూ వెళ్లిపోయింది లోపలికి.

కొంతసేపయేక గదిలోంచి అందరూవచ్చేరు — అందరి ముఖాలూ ఆనందంగాఉన్నాయి ఏదో బరువు బెంగా తీరిపోయినట్టు. "అదే మంచిపని —" "అదొక్కటే మార్గం!" "రక్షించేరు మరిదిగారూ.. మా పరువు కాపాడేరనుకోండి...కాని జరిగిన సంగతి

**జరిగిన కథ-8 :** అనసూయ అక్కకీ, అన్నకీ పెళ్లయిపోతుంది. తండ్రి వుద్యోగంనుంచి రిటైరైపోతాడు. ఆర్థిక బాధలు మనుషుల్ని ఎలా మార్చేస్తాయో అనిపిస్తుంది అనసూయకి అన్నని చూస్తుంటే. అనసూయ పెళ్లి ఆ యింట్లోవారికి ఓ సమస్య: ఎస్.ఎస్.సి. పాసయిన అనసూయ చదువు ఆగిపోతుంది ఆర్థిక యిబ్బందులవల్ల. ఆడపిల్లలకి చదువనూ, వ్రాయనూ నేర్పించటానికి బడి పెడ్తారు అనసూయా కనకదుర్గ. చిన్నతనంలోనే వైధవ్యం పొందిన స్నేహితురాలు నిర్మల చేత మెట్రిక్‌కు కట్టిస్తుంది అనసూయ. భర్త వదిలేసిన సుగుణతో పరిచయమవుతుంది అనసూయకి. తన జీవితంగురించి అనసూయకు చెప్పటం మొదలెడ్తుంది సుగుణ. సుగుణ అక్క సంధ్య. రంగారావ్‌ను ప్రేమించిన సంధ్య అతడ్ని నమ్మి తన శీలాన్ని అర్పిస్తుంది. నువ్వునాకు జీవితాంతం ఉంపుడుకత్తెగా వుంటానంటేనే నీ అక్కను పెళ్లాడతానంటాడు రంగారావ్ సుగుణతో. తను కోరినట్లు శీలం పోగొట్టుకోటానికి సుగుణ అంగీకరించకపోవటంతో సంధ్యకి పన్నవకుమార్ అనే అతనికీ అక్రమసంబంధం సృష్టిస్తాడు రంగారావ్.

ంటే సంధ్యవిషయం మరో మనిషికి తెలియరాడదు...'' అంటూ వచ్చేరు.

అందరూ నా చుట్టూ మూగేరు— ''అదృష్టవంతురాలివే సుగుణా!'' అంది పెద్దక్క.

నాకేమీ అర్థంకాలేదు ''అదృష్టవంతురాలివే మరదలా! ఇంజనీర్‌నీ ఒక ఉత్తముణ్ని మొగుడిగా కొట్టేస్తున్నావ్...'' అన్నారు నా పెద్దబావగారు.

''ఎవరికెంత ప్రాప్తమో అంతేతప్ప ఎక్కువ ఎక్కడ్నించొస్తుంది?'' అంది అమ్మ. తరవాత నన్ను దగ్గరికితీసుకొని అంది. ''నువ్వుండబట్టి పరువు నిలబడింది తల్లీ...''

''ఏమిటమ్మా?'' అన్నాను కోపంగా —

''నీకూ రంగారావుకీ అదే ముహూర్తానికి పెళ్లి నిశ్చయించేసేం...''

కోపంగా అరిచేను... 'నేను చేసుకోనమ్మా! అక్కకోసం నిశ్చయమైన మగాడ్ని నేను పెళ్ళాడనమ్మా!''

''అంతపనిచేసేక దానిని ఎవడు చేసుకుంటాడే? అప్పటికీ అతను చెప్పనేచెప్పేడు. 'ఆ ముహూర్తానికి సంధ్యకికట్టమన్నా కడతాను..సుగుణని చేసుకోమన్నా చేసుకుంటాను'అని. మీ ఇంట యీ పెళ్లి ఆగిపోకూడదు. దేవుడులాటి మనిషికి ఆ దరిద్రపు ముండనిచ్చి కట్టపెట్టమంటావా? అతను ఒప్పుకున్నా, నా ప్రాణంవుండగా జరగదు!'' అమ్మ.

ఈ సందట్లో రంగారావు ఎల్లగా జారుకున్నాడు.

''అక్కని చేసుకోవలసినవాడు నన్ను చేసుకోవడాన్ని గురించి ఎలా అందరికీ సంజాయిషీ ఇస్తారు— నలుగురూ నవ్వరా?''

''ఇంతకన్నా ఎక్కువగానే నవ్వివుందురే ... దేవుడిలా కాపాడేడు. సంధ్యకి క్షయరోగమనీ, ట్రీట్‌మెంట్‌కి బొంబేవెళ్లిపోయిందనీ చెప్తాం. నేను రేపే సంధ్యని తీసుక బొంబేవెళ్లిపోతాను. సంధ్యని అక్కడ హాస్పిటల్‌లో చేర్పినట్టు ఉత్తరం రాస్తాను. ఆ ఉత్తరాన్ని నలుగురికీ చూపించండి పెళ్లిపందిరిలో— క్షయరోగిం వున్నదాన్ని యెవరు చేసుకుంటారు ? యింకానయం ఆహ్వానాలు యెవరికీ ఇంకా వెళ్లలేదు. కొత్తవి వేసు కొట్టించవచ్చు.'' పెద్ద బావగారన్నారు.

''నాకీ మనిషితో పెళ్లి యిష్టంలేదు. నేను చేసుకోను.'' అన్నాను ఆవేశంగా.

ఆమాట విన్న అక్క పరుగునవచ్చి నా జుత్తు పట్టుకుంది. ''రంకుముండా! యెందుకే యీ కల్లిబొల్లి కబుర్లు ? నువ్వు వాడూ కలిసి ఆడిన నాటకంకాదే యిది ? చెప్పు ముండా ! ఆడేరా లేదా నాటకం ? ఇప్పుడు పైకి నామీద ప్రేమ ఒలికిపోతున్నట్టు కల్లిబొల్లి కబుర్లు చెప్తున్నావా ?'' అంటూ కొట్టడం ఆరంభించింది.

దానికి మతి చెడిందని గదిలోపెట్టి తలుపు వేసేరు.

''దాని మాటలు పట్టించుకోకు సుగుణా ! గోలచెయ్యక పెళ్లికి ఒప్పుకో. అంత మంచివాడు దొరకడం నీ అదృష్టం...''

''నేను చేసుకోనుగాక చేసుకోను...''

''చేసుకోకపోతే నేను ఉరోసుకు చస్తానే

## ఒక కన్య చెప్పిన కథ

సుగుణా ! అదంత చేసింది — నువ్వు తల్లిని చంపినదానివవుతావ్!'' అని ఏడవడం ఆరంభించింది అమ్మ.

ఆరోజల్లా అక్క ఏడుస్తూనేవుంది, తనకి జరిగిన అన్యాయానికి.

నేనూ ఏడుస్తూనేవున్నాను— నాకు జరగబోయే అన్యాయానికి. ఆ మనిషి నిజ స్వరూపం తెలుసుకున్నాక ఎవరి కిష్టముంటుంది ఆ మనిషంటే. కాని యిప్పుడు నా యిష్టాయిష్టాలతో ప్రమేయం లేకుండా పనులు జరిగిపోయేయి.

మర్నాడు పెద్దక్కా, పెద్దబావా, సంధ్యా కూడా బొంబే వెళ్లిపోయేరు. శుభలేఖలు మళ్లా అచ్చుఅయ్యేయి నా పేరు అక్క పేరుకి బదులుగా రాయబడి. ఆ పెళ్లి తప్పించుకుందుకి ఇంట్లోంచి పోవడంతప్ప మరే మార్గమూ లేదు. ఎక్కడికి పోను ? ఆత్మహత్య చేసుకోవాలి — లేదా పెళ్లన్నా చేసుకోవాలి. ఆత్మహత్య చేసుకొనే ధైర్యం లేదు. అందువల్ల తల్లినీ చంపినదాన్నవతాను. ఆ వయసులో చద్దామన్న ఊహ నాకెప్పుడూ రాలేదు ... బతుకుదామన్న ప్రగాఢమైన కోరికతప్ప.

నా అక్కకి పెళ్లి అవవలసిన లగ్నానికి నాకు పెళ్ళయింది, నాఅక్కని పెళ్లాడవలసిన మనిషితో అక్కని సేనిటోరియమ్‌లో చేర్పినట్టు ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరానికి ఎక్కడలేని ప్రచారం ఇచ్చేరు. ఏకారణంవల్ల ఇలా చెయ్యవలసి వచ్చిందో తెలుసుకొని అందరూ సంధ్య కోసం విచారించారు. రంగారావుమంచి తనాన్నిపొగిడేరు—కాని నాజీవితం ఏం అవబోతుందో ఎవరూ ఆలోచించలేదు. దీనికంతకీ కారణం నేనేనా అని అనుమానం వస్తూ ఉంటుంది నాకు. ఆనాడు...అక్కతోనూ, అతనితోనూ పిక్చర్‌కే వెళ్లకుండా ఉంటే నాజీవితం ఎలా ఉండేదో అని ఆలోచిస్తూ ఉంటాను. కానిఆలోచించి ఏం లాభం?''

### 12

సుగుణకథ పెళ్లితో సుఖాంత మవలేదు. సుగుణ దుఃఖం ఆరంభం అయింది పెళ్లితోనే. సుగుణ బాధలు ఆరంభం అయ్యేయి పెళ్లితరవాతే.

మనిషికి బుద్ధి వక్రించినప్పుడు ఏయేదారులు తొక్కుతాడో రంగారావు గురించి తెలుసుకుంటే అర్థమవుతుంది. రంగారావుతో పెళ్లికి సుగుణ అతడు అడిగినప్పుడే ఒప్పేసుకుంటే ఆమెజీవితం ఎలా ఉండునో ఆలోచిస్తే ఇంతకన్న దుఃఖకరంగా ఉండకపోను అనిపిస్తుంది.కాని మనిషి మానవత్వంతో ప్రవర్తిస్తాడు కాని దానవత్వంతోకాదు, అందువల్లే సుగుణ మనిషిలా ప్రవర్తించింది. అహంతో పెళ్లి మాటని తోసిపుచ్చింది అతను కోరినప్పుడు, సంధ్యని మోసం చెయ్యడం ఇష్టంలేక, అతడి ప్రవర్తన నచ్చక. అతడామెను మోసగించాలని చూసినప్పుడూ అలానే తప్పించుకో జూసింది. కాని ఆఖరికి అతడికి ఏదో విధంగా లొంగిక తప్పలేదు. అతడు వక్ర మార్గం అవలంబించి సంధ్యనికాదని, సుగుణని చేబట్టేడు. సంధ్య అతడిస్వార్థానికి ఎరగా అయింది.

పెళ్లి అయ్యేక ఇద్దరి జీవితం సాఫీగా వెళ్లిపోయిఉంటే బాగానే ఉండును. కాని విరిగినమనసులు. సందేహం, అనుమానం, ద్వేషంతో ఆరంభం అయిన దాంపత్యం ఎలా నడుస్తుందో ఆమెజీవితమూ అలానే నడిచింది.

అంతవరకూ చెప్పేక, నాతో తన వైవాహిక జీవితం గురించి చెప్పడమా, మానడమా అని సందేహించింది. చెప్పడానికే నిశ్చయించింది. బరువు మనసులోంచి పోతేనేకాని శాంతి ఎలాదొరుకుతుంది?

సుగుణ మళ్లా ఇలా చెప్పింది.

''నాకు పెళ్లయిందన్న మాటేకాని సంతోషం లేదు. అతనితో ఈ పెళ్లి నాకిష్టంలేదని అతనికి తెలుసు-- అక్కని అతడు మోసం చేసిన సంగతి నాకు తెల్సనీ అతడికి తెలుసు. దానికితోడుగా నేను పెళ్లికాక ముందు అతడి కోరికలని మన్నించలేదని అనుమానం మనసుని బాధిస్తోంది— ఈ చరిత్రతో నాకతను భర్తఅయ్యేడు.

''జరగకూడనిది జరిగింది. నేను అతడి భార్యనయ్యేను ఇంకనేను చెయ్యగలిగింది ఏమీలేదు, అతడు చూపేదారిలో నడవడం తప్ప. లొంగిపోవడం కన్నా. ఇంకేం మార్గం వుంది? నా ఈ శరీరం అంతా అతడికి ధారాదత్తం అయిపోయింది అగ్నిసాక్షిగా. కాబట్టే ఇది అతనిసొత్తు, అన్న అభిప్రాయం మనసులో ఏర్పరచుకున్నాను అనసూయా! నువ్వు నా అభిప్రాయంతో ఏకీభవించక పోవచ్చు. అందుకు భిన్నమైన అభిప్రాయంతో నేనుంటే నా జీవితం నరకం అవటంతప్ప మరేం ఫలితం కలుగుతుంది?

''పెళ్లిఅయిపోయేక ఎవరి మానాన్న వారెళ్లి పోయారు నా శోభనం నాటిరాత్రి ఆరంభంఅయింది, నేననుకున్న దానికి భిన్నంగా అతని ప్రవర్తన. నేనతనికి ప్రతిఘటించక లొంగుతే అతడింక నన్ను బాధపెట్టడని అనుకున్నాను— కాని అతడికి నా మనస్సుకావాల్సి వచ్చింది. పుస్తెకట్టటం వల్ల అతడికి శరీరం స్వాధీనం అయింది. అది మరెవరికీ చెందబోదు. కాని ఈ శరీరంలో మనసన్నదొక్కటుందే? ఆమనసును అతడికి సమర్పిస్తున్నానని అతడికి నమ్మకం ఏమిటి? అదికనిపించదు కదా? ఈ ఆలోచన ఏక్షణం అతడి మనసులో ఆరంభం అయిందో ఆ క్షణమే నాజీవితంలో చిత్రహింసకూడా ఆరంభం అయింది.

''నీకు మితిలేని అహంకారం!''అన్నడై లాగిస్తూ నాజీవితంలోకి ప్రవేశించేడు రంగారావు ఆ రాత్రి. నేను జవాబివ్వలేదు.

అతడు రచయిత, కవీకూడా, వీళ్లకి మనస్సులు కావాలి. వాళ్లు శరీరాలనే కాక మనస్సుల్నికూడా చిత్రంగా హింసించగలరు. వాళ్లు తమకే మనుషుల ప్రవర్తన, మానసిక శాస్త్రం తెలుసు అనుకుంటున్న మనుష్యులు. కాని వాళ్లకి తెలిసిందొకటే. ఒకరు పడేబాధలు చూసి కన్నీరు కార్చడం తెలుసు. కాని తమవరకూవస్తే ఎంత స్వార్థంగా ఉండాలో అంత స్వార్థంగానూ ఉంటారు. జీవితమనే ప్రయోగశాలల్లో, వారి నిజమనస్సులనీ, వారిసన్నిహితుల మనసులనీ ప్రయోగవస్తువులుగా వాడుకుంటారు.

''నేను జవాబివ్వలేదు. అతనికా నమ్మకం ఏర్పడ్డాక నేను కాదన్నా నమ్మడు.

''నీఅందం చూసుకొని నీ అహంకారంకదూ ?''

నేను దానికీ జవాబివ్వలేదు— తలవంచుక నిల్చున్నాను. నాతల ఎత్తి నాకళ్లల్లోకి చూసేడు.

"నన్ను నువ్వు మోసగించలేవు. ఆ ప్రయత్నం మాత్రం చెయ్యబోకు."

నేను జవాబివ్వ లేదు—"మౌనవ్రతం దాల్చేవా? మాట్లాడ్డం నీడిగ్నిటీకి లోపం అనుకుంటున్నావా?"

"అన్నీ మీరేఅనేసి జవాబుకూడా ఇచ్చేస్తున్నారు. ఏం మాట్లాడమంటారు?"

"నయమే— మాట్లాడుతున్నావ్! మూగదానివయ్యేవేమోనని భయపడ్డాను. ఎన్నాందుకు మౌనం చేద్దాం అనుకున్నావు"



"మోసం ఏమిటి ?"

"ఆరోజు వస్తానని రాలేదెందుకు?"

"నేవస్తానని చెప్పలేదు. మీరు రమ్మంటే వెళ్ళడం మంచిది కాదని నేననుకున్నాను.."

"మీ అక్కపెళ్ళినాతో అవాలని నీకు ఉండేది కాదా?"

"ఉండేది.."

"మరెందుకు రాలేదు? మాట్లాడు? నాకు తెలుసు— నేను వెళ్ళకపోయినా వీడుఅక్కని పెళ్ళాడక తప్పదు. ఎందుకంటే దాన్ని పెళ్ళాడితేనేకాని వీడి ముఖం ఈజన్మలోచూడను. నాముఖం చూస్తేనేకాని వీడు బతకలేడు.. అనుకున్నావ్ కదూ?"

కాదని ఏం లాభం ఉంది— ప్రతిదానికీ ఔను అనేస్తే, నేను అలా అనుకున్నానని అనుకోకపోవచ్చు "ఔను—అలానే అనుకున్నాను.." అనిచెప్పేను.

"మీఅక్కని పెళ్ళిచేసుకున్నాక నాకు మంగళ హారతి పడదామనుకున్నావ్!"

"ఔను.."

"ఇంతమోసం చేద్దామనుకున్నావా?"

"శీలం కాపాడుకో చూడడం మోసంకాదు.."

"మాటఇస్తే నిలబెట్టుకోవడం నీకు అలవాటు లేదా?"

"అసంగతి మీరనడం!"

"అనకూడదా?"

"శీలాన్ని దోచుకుందుకి మీరు ఎన్ని మాటలని నిలబెట్టుకోలేదో మీకు తెలీదా?"

"చెప్పు వింటాను?"

"అక్కని పెళ్ళడతానని నమ్మించి దాని శీలం దోచుకున్నారు.."

"ఇంకా?"

"ఎవడో పన్నవకుమార్‌కి అమెకీ అక్రమ సంబంధం అంటకట్టేరు.."

"ఇంకా?"

"నేను లొంగకపోతే, మా కుటుంబం పరువు కాపాడుతున్నట్టు నటించి అక్కని కాలదన్ని నాకు పుస్తెకట్టే ఏర్పాటు చేసుకున్నారు. నన్ను హోటల్‌కి రమ్మంటు అంతకుముందే ఆ ఆకాశరామన్న ఉత్తరం తయారు చేసుకున్నారు - ఆ ఫోటోలు తీసి ఉంచు కున్నారు. అంటే మీకు అక్కని పెళ్ళాడే ఉద్దేశమే లేదని రుజువవుతోంది. నేను లొంగే ఉంటే నా శీలమూ దోచుకుందురు ...నన్నూ, అక్కనీ కూడా నట్టేటముంచి ఉందురు!.."

"ఎలా అనుకుంటున్నావ్..? కనీసం నిన్నన్నా పెళ్ళిఆడి ఉందును.."

"ఎందుకు పెళ్ళాడిఉందురు? మీకుకావల్సింది దొరికేక . ఆఉత్తరం.. ఫోటోలు. అందరికీచూపించి చల్లగా వెళ్ళిపోయి ఉందురు మాఖర్మకి వదిలేసి.."

"అంటే నేను మోసగాడ్నంటావ్..?"

"నేను అనలేదు--నన్నుమోసకత్తెనని మీరంటే అన్నాను —ఆడపిల్లల శీలంతో ఆడుకుందుకి అంత ప్రయాసపడ్డప్పుడు, అన్ని అబద్ధాలని సృష్టించి నప్పుడు, పెళ్ళికాని ఆడది తనశీలం కాపాడుకుందుకి అబద్ధాలాడినా, మాటతప్పినా అది మోసం అనే అధికారం ఎవరికుంది ?"

"ఆమోసగించ బడినవాడికి లేదా?"

"ఒకలా చూడండి— నేనిప్పుడు మీభార్యని. మరొకడెవడన్నా, నన్ను లొంగ దీసుకుందుకు ప్రయత్నించి, అందులో సఫలం పొందుతే, అసంగతి మీరు విని ఆనందించగలరా?"

అతను మాట్లాడలేదు. "నేను మీరుకోరినట్టు లొంగిఉంటే, తరవాత నన్ను మీరు పెళ్ళిచేసుకున్నా నామీదమీకు నమ్మకం ఉంటుందా? నామీద గౌరవం ఉంటుందా?"

"నువ్వు ఎన్ను తప్పకుండా బోల్తాకొట్టిస్తావని నేనను కున్నది కరెక్టే—అందుకే నేను తీసుకోవల్సిన చర్యలు నేను తీసుకున్నాను. నాకు నువ్వు లొంగ కుండా ఉంటే, నిన్ను పెళ్ళి ఆడతానని మంచి ఎత్తు వేసేవ్."

"అదే నా ఉద్దేశం అయితే మీరు పెళ్ళాడ మన్నప్పుడే ఒప్పుకొని ఉందును."

"అలా ఒప్పుకుంటే మీఅక్క ఆత్మహత్య చేసుకుంటుంది. అంతపని చెయ్యకపోయినా లోకం దుమ్మెత్తిపోస్తుంది. నీ బంధువులూఅంతా నిన్ను ద్వేషిస్తారు."

"మిమ్మల్ని పెళ్ళాడాలన్న ఉద్దేశం నాకే నాడు లేదు"

"అందుకే కథా నన్ను కవ్వించావ్? నేను నా ప్రేమని వ్యక్తంచేసేసరికి నామీద నీకు ఇంటరెస్ట్ పోయింది. అప్పుడు నీ అక్కపట్ల నీకర్తవ్యం గుర్తు కొచ్చింది. నామనసుని జయించేక నన్నో శవంలా వదిలేసి, మరోమనసుని జయించడానికి పోదాం అను కున్నావ్. కాని నిన్ను వదల్లేదు నేను—మీవాళ్ళే మీ అక్కని పెళ్ళి పీటల మీంచి తీసేసి నిన్ను కూర్చో పెట్టేరు — నువ్వు వాళ్ళందర్నీ ఉద్ధరించేవ్— కుటుంబపరువు నిలబెట్టేవ్ అని మెచ్చుకున్నారు. నువ్వు కోరుకున్న విధంగా నాతో నీపెళ్ళయింది. నామనసుని జయించడమే కాకుండా, నన్నుకూడా నీవాడినిగా చేసుకున్నావ్ చట్టరీత్యా. అంతా అయ్యేక ఇప్పుడు గర్వంగా, పొగరుగా నిల్చున్నావ్ "

అతడు చేసిన పాపపు ఆలోచనలన్నీ నేనే చేసేనని నేర్పుగా చెప్పే మనిషితో ఏమిటి వాదించడం ? వాద ప్రతివాదనలతో యిది తీరే సమస్యా ? నేను అతడి మనస్సునీ శరీరాన్నీ నావశం చేసుకున్నాననీ, అదే నా ఉద్దేశం అనీ, ఇప్పుడు నా మనసుని అతడికి యివ్వకుండా పొగరుగా ధిక్కరిస్తున్నాననీ ఏమేమో అన్నారు — అటువంటి ఉద్దేశం నాకేనాడూ లేదని అతడికి తెలీదుకనకనా ?

రాత్రల్లా అలా గడిచింది. ఎన్ను నిలబెట్టి, అతడు కుర్చీలో కూర్చొని, ఒక సైకాలజిస్టు, పేషెంటుయొక్క మనసు లోతులలోకి తరచి చూడడానికి ప్రయత్నించినట్టు ప్రయత్నించేడు. తరవాత నిద్రొస్తే మంచమ్మీద పడుకున్నాడు. నేను నేలమీద దొర్లేను. మూడు రాత్రుళ్ళూ అలానే గడిచేయి — మానసికంగా క్షోభపెట్టి, కాల్చుకతిన్నాడు. మూడవరోజున ప్రేమ వేపు మళ్ళింది అతని పరిశోధన.

"నువ్వు నన్ను ప్రేమించలేదు ... ఔనా ?" అడిగేడు.

నేను నిల్చున్నాను. అతను మంచమ్మీద సాగోరి, కట్టిపడేసున్న పక్షిని చంపబోయేవాడు చూసినట్టుగా చూస్తూ అడిగేడు.

"నాకు తెలీదు."

"నామీద ప్రేమ వుందో లేదో నీకు తెలీదా ? పోనీ యిది చెప్పు - నన్ను నువ్వు ద్వేషిస్తున్నావు - ఔనా ?"

"నేను మిమ్మల్ని ద్వేషించలేదు. ఇప్పుడు మీరు నా భర్త. భారతీయ స్త్రీ భర్తని ద్వేషిస్తుందా ?"

"మొగుడికి విషమిచ్చి చంపేసిన భారతనారు లెందరో వున్నారు."

"అయితే వాళ్ళు భార్యలేకాని, భారతీయ స్త్రీలు కారు..."

"నువ్వే భారతనారివీ... పతివ్రతవీ అంటావు..."

"ఔను ... అంటాను."

"కాని నన్ను ప్రేమించవు ?"

"మిమ్మల్ని ద్వేషించను..."

"ప్రేమిస్తావా లేదా ? అది చెప్పు..."

"ప్రేమించడం అంటే ఏమిటో మీరు నాకు చెప్పినట్టయితే ఆప్రకారం నడుచుకుంటాను."

దానికి అతను ఏమీ జవాబు చెప్పలేక మరోలా మాటాడేడు.

"ప్రేమించటం అంటే నీకు తెలీదన్నమాట?"

"తెలుసు."

"తెలుసా ? ఏమిటది ?"

"ప్రతిఫలం కోరకుండా ఒకరికి మంచి చెయ్యడమే ప్రేమ. తిరిగి యేమీ కోరకుండా, ఒకరి కష్టాలని తగ్గించడానికీ, దుఃఖాలని పోగొట్ట డానికీ, స్వార్థాన్ని కొంత వదులుకొని పాటుపడడమే ప్రేమ అంతకుమించి ప్రేమంటే నాకు తెలీదు."

"నువ్వలా ప్రేమించగలవా ?"

"ఆ శక్తి నాకు లేదు అందుకే అక్క దుఃఖాన్ని పోగొట్టలేకపోయేను..."

"ఎలా పోగొట్టేవుందువు ?"

"ఉరిపోసుకొని..."

"ఇప్పుడా పని చెయ్యగలవా ? మీ అక్కని పెళ్ళాడతాను ?"

"ఇప్పుడా పని చెయ్యను — నా అక్కని పెళ్ళాడే అవకాశం మీకివ్వను !"

"అంత ప్రేమా నామీద ? నేనంత స్వంత వస్తువు నయిపోయేనా నీకు ?"

నేను జవాబు చెప్పలేదు. దానికి జవాబు నా మనసుకి చెప్పుకున్నాను.

"నీకు మళ్ళా దాని బతుకులో ఆడుకొనే అవకాశం యివ్వను. భార్యకి భర్తా, భర్తకి భార్యా, బుట్టలోపెట్టి ఆడించే పాములు. ఆమె దృష్టిలో ఆమె ఆడించేదీ, అతడు పడగవిప్పి ఆడేవాడూ — అతడి దృష్టిలో అతడు ఆడించేవాడూ, ఆమె పడగవిప్పి ఆడేదీ. ఈ ఆటని చూసి ఆనందించేది సమాజం. పాముని సరిగా ఆడించకపోయినా, దానిని తన అధీనంలోంచి వదిలేసినా, అది వెళ్ళి పైవాళ్ళ ఇళ్ళలో దూరి వాళ్ళని కాటేస్తుంది. ఆ పక్కవాళ్ళ దాంపత్యాన్నీ, జీవితాలనీ నాశనం చేస్తుంది. నేనిప్పుడు ఉరితీసుక చస్తే యీ పాము విచ్చలవిడిగా విజృభించి, అక్కనేకాదు, ఎందరినో మళ్ళా

కాటువేస్తుంది.'' కాని ఆ జవాబు నేను ఇవ్వలేదు.

''అయితే నన్ను ప్రేమించవూ...ద్వేషించవూ... అంతేనా ?''

''మీరేం అనుకుంటే అది...''

''నీ శరీరాన్నేతప్ప మనసుని నాకివ్వవన్న మాట...''

''శరీరం లేకుండా మనసన్నది వుంటుందా?'' అడిగేను.

''ఉండదు — కాని మనసులేని శరీరాలుంటాయి. నీ మనసుని కాపరం చెయ్యకుండా నువ్వు దాచుకోవచ్చు...''

''మీపరం చెయ్యడమంటే ఏం చెయ్యాలో చెప్పండి ... చేస్తాను.''

దానికి మళ్ళా జవాబు లేదు.

''చెప్తా విను ! అలా ముఖం ముడుచుక వుండక నేను నీ ముందున్నందుకు ఆనందంగా వుండు. సంతోషంగా నవ్వు. కేరు, తుళ్ళు. జీవం ఉట్టిపడేలా నా కళ్లలోకి చూడు. మనసివ్వడం అంటె అదే...''

నేను చిరునవ్వు నవ్వేను ... ''నవ్వించండి నవ్వుతాను. మీరు అలా నా కళ్లలోకి చూడండి — నేనూ అలా చూస్తాను. మీరు నన్ను చూడగానే ఆనందంతో కేరండి, తుళ్లండి ... నేనూ తుళ్ళుతాను — నేను మీ వస్తువని. మీరు ఏ రాగం వాయిస్తే వీణ ఆ రాగం పలుకుతుంది. నన్నొక దోషిలా నిలబెట్టి, మూడురోజులయి నేను చెయ్యని నేరాన్ని రుజువు చేద్దామని చూస్తున్నారే ? నన్ను మీరు ద్వేషిస్తున్నప్పుడూ ... అనుమానంతో చూసినప్పుడూ నేను దోషిలా కనిపించక మరోలా యెలా కనిపించగలను ? మీరు కోరిన భావాలు నాలో యెలా కలుగుతాయి ? చెప్పండి ?''

''నీకు మాటలు తిప్పిచెప్పడం వచ్చు...''

''మాటలు తిరగవు. అవి అనే మనిషి మనసులోని ఉద్దేశమే తిరుగుడుగా వుంటుంది !''

''అంటే ?''

''అంటే, మాటలు అందరూ అనగలరు — అవి మరొకరికి అర్థంఅవడంలోకూడా ఏమీ తికమక వుండదు. కాని అన్నవాడు, తను అన్న మాటల యొక్క అర్థం విన్నవాడు అనుకున్నది కాదని వాదిస్తాడు. అన్న మాటకీ, ఉన్న వుద్దేశానికీ పొత్తు కుదరదు. అన్నమాట నిలబెట్టుకొనేవారు చాలా కొద్దిమంది.''

''అందులో నువ్వొకర్తివి.''

''కాను.''

''నీకు గర్వం లేదని నువ్వంటావా ?'' మరో పాఠంలోకి మారేడు.

''గర్వం లేనివాళ్ళు సన్యాసులూ...మహాత్ములూ అవుతారుట !''

''అయితే నీకు గర్వం వుందని ఒప్పుకుంటు న్నావు ?''

''నాకు ఆత్మగౌరవం లేకపోతే నన్నొక పురుగులా తీసిపారేరా అందరూ ?''

''నీ గర్వాన్నీ... ఆత్మగౌరవాన్నీ నేను ధ్వంసం చెయ్యలేనంటావా ?''

''మీ వస్తువుని ధ్వంసం చేసుకుంటే నష్టం మీకే..''

''ఏమిటా నష్టం నాకు ?'' అడిగేడు.

''నా గర్వాన్నీ, ఆత్మగౌరవాన్నీ ధ్వంసం చేస్తే మీలోకూడా అవి ధ్వంసం అవతాయి. అప్పుడు యిద్దరం పక్షవాతం వచ్చిన మనష్యుల్లా, మనసు చచ్చిన మనుష్యులలా బతకాలి. విరిగిన మనసుతో ఏం ఆనందం అనుభవిస్తారు, ఏం జీవితం జీవిస్తారు? శరీరాలు మనవి బాగుంటాయి. ఆరోగ్యంగా వుంటాయి... కాని మానసికంగా కుష్ఠురోగం వచ్చేస్తుంది. మన మనసులని ఎవరిముందూ ప్రదర్శించలేము. ఎవరూ మన చుట్టుపక్కలకి రారు...''

''నువ్వు నా వస్తువువని అన్నావు — నీకు నీ మనసు, నీ ఆత్మా లేవా ?''

''అవికూడా వస్తువులేకదా ? కొన్ని వస్తువులు కనిపిస్తాయి — కొన్ని కనిపించవు. ఈ శరీరంతో మీ దగ్గరికి వచ్చేనంటే అన్నింటితోనూ మీ వస్తువుని అయినట్టేకదా ?''

''నువ్వు మనసులో నన్ను గౌరవిస్తున్నావో లేదో, మరొకరి గురించి ఆలోచిస్తున్నావో లేదో, నన్ను ప్రేమిస్తున్నావో, ద్వేషిస్తున్నావో, తియ్యటి కబుర్లు చెపుతూ వెన్నుపోటు పొడుద్దామని అనుకుంటున్నావో ఏమో, ఎలా తెలుస్తుంది ?''

నేను నవ్వేను — ''అదా మీ అనుమానం ? ఆ అనుమానం మీకు ఏ క్షణమయితే మీ మనసు లోంచి పోతుందో, ఆ క్షణమే మీకు తెలుస్తుంది నిజం — ఆ అనుమాన బీజం మనసులో వున్నంత సేపూ నేను నా మనస్సులో ఏం అనుకుంటున్నానో మీకు తెలీదు — మాటలతో చెప్పినా మీరు నమ్మరు.''

ఆ రాత్రి అలా గడిచింది —

''భట్టివిక్రమార్కుడి సింహాసనం, భోజుడు ఎక్కినప్పుడు చిలకలు వేసిన ప్రశ్నలలా వున్నాయి. అవి చెప్పిన కథల్లా వున్నాయి... నీ కథలు. ఇలా ఎన్ని రోజులు గడిచేయి ?'' అడిగేను నేను, సుగుణని.

''సరే... టూకీగా చెప్పాలంటే యిలా ఒక ఏడాది నడిచింది. అంటే ఏడాదిపాటు నన్నలా నిలబెట్టి మాట్లాడేరనికాదు. భార్యాభర్తలగా బతకడం ఆరంభించేం... సినీమాలకి వెళ్లేం. పార్కులకి వెళ్లేం. చీరలూ, నగలూ కొన్నారు... అతనికి ప్రామోషన్ వచ్చింది వుద్యోగంలో — పెద్ద యింటికి మారేం — కూడూ గుడ్డలకి లోపం లేదు— శారీరక సుఖాలకి లోపం లేదు — అమ్మ నా దగ్గరే వుండేది ''

''మీ అక్క సంగతేమయింది ?'' అడిగేను నేను.

''అక్కని మా దగ్గర కెప్పుడూ రానివ్వద్దనీ, అందువల్ల మా కాపురం చెడుతుందనీ అమ్మకి చెప్పేను. ఇప్పుడు యితనితో మానసికంగా సంఘర్షణ పడుతున్న నేను, అక్క వస్తే ఆమెతో కూడా యుద్ధం చెయ్యాలి. దాని మాటలుకూడా పడాలి. అదృష్టవశాత్తూ అక్కకి హైదరాబాద్‌లో సెక్రటేరియట్‌లో ఉద్యోగం దొరికింది. అమ్మ కూడా అక్కడికి వెళ్లిపోయింది కొన్నాళ్ల తరవాత. మేం యిద్దరం మిగిలేం.

''అప్పడతనికి, మాటలతో నేకాకుండా, చేతలతోకూడా హింసించే అలవాటు ఆరంభమయింది. దానికి చాలా కారణాలున్నాయి. నేనంటే అతడికి యిష్టం తగ్గింది. అలా అని నేను మరొకవేపు చూసినా, మరొకడితో మాట్లాడినా సహించి ఊరుకొనే తత్వం కాదతనిది. ఆ అహంకారం ఆ మనిషి కుంది.

''తరవాత అతడికి దూరంగావున్న అక్కమీదికి మనస్సు మళ్లింది. సాహిత్యపరంగా, ఆ అభిరుచి వున్న స్త్రీతో మానసిక సాహచర్యం అతడికి కావల్సి వచ్చింది. అక్క చేసిన కొన్ని రచనలు అప్పుడప్పుడూ పత్రికలలో పడటం అతడి దృష్టిని ఆమెవేపు మళ్లించింది. ఆ తృప్తి నేను అతనికి యివ్వలేక పోయేను. చపలత్వం వున్న మనిషిని మార్చవచ్చు. కాని ఆ చపలత్వమే ఆనందం అనుకున్న మనిషిని ఏవిధంగా మార్చగలం ?

''అక్కతో అతడి కెప్పుడు మళ్ళా పరిచయం అయిందో నాకు తెలీదు. కాని ఆనాటినించీ శారీరకమైన బాధలుకూడా ఆరంభమయ్యేయి.''

''ఎందుకంటావు ?'' అడిగేను.

''నేను మానసికంగానే కాకుండా, శారీరకంగా కూడా ఏ మగాడినీ మరి కోరుకొనే అవకాశం వుండకుండా చేద్దామని నా శరీరంమీద పని ఆరంభించేడు. అతడి వస్తువమీద అతడి యాజమాన్యపు ముద్రలు వేసేడు. అది మీకు చెప్పను అనసూయా ! ఆ బాధ పగవాడికికూడా వద్దు.''

''అతనికి నీమీద అనుమానం కలిగిందా ?''

''అనుమానం కలగలేదు. కాని నామీద మోహం తగ్గింది. నావల్ల అతడికి అన్ని అవసరాలూ తీరడంలేదు. అతడికి కావల్సిన ఇంటలెక్చ్యువల్ కంపేనియన్‌షిప్ యివ్వడంలేదు. అతడి మెదడుకి నిషా తగ్గిపోయింది. చిన్ననాడు చూడు ఒక బొమ్మతో ఆడుకుంటాం — ఆ బొమ్మమీద కొన్నాళ్లకి యిష్టం పోయేది. కొత్త బొమ్మ తెచ్చుకొనేవాళ్లం — అప్పుడీ పాతబొమ్మ మరెవరికీ దక్కకుండా ముక్కలు ముక్కలుగా పీకి ధ్వంసం చేసేడంకాని, పెంటకుప్పమీద పారేడంకాని చేస్తాం. కాని ఆ బొమ్మని ఇంకొకరికిమాత్రం ఆడుకుందుకి ఇవ్వం. చదువు, సంస్కారం అబ్బి, పెద్దయేక యీ మనస్థత్వం తగ్గిపోతుంది. మానసిక పరిపక్వత వస్తుంది. కాని కొందరుమాత్రం ఆ చిన్ననాటి బుద్ధులు పెద్దయేకకూడా మార్చుకోలేరు. రంగారావు అటువంటివాడు. నామీద యిష్టంతగ్గి, నా అక్కమీద యిష్టం పెరగ్గానే నన్ను ధ్వంసం చెయ్యడం ఆరంభించేడు. ఆ పని ఒకవిధమైన పైశాచిక ఆనందంకూడా అతడి కిచ్చేది.''

''నువ్వెందుకు తిరగబడలేదక్కా ? యింతటి అమానుషాన్ని యెలా సహించేవ్ ?''

''అతని మనసులో ఏం వుండేదో నాకు తెలిసేదికాదు — నన్నొక వాదనలోకి దింపి ఆ పనికి ఒప్పించేడు.''

''ఏమిటా వాదం ?''

''వింటావా ? చెప్తాను విను.'' సుగుణ చెప్పింది.

[ఇంకా వుంది]

# కళాకారులిద్దరూ!

కె. యస్. ప్రసాద్



ఆ భవనం పై అంతస్థులో వున్న 'డయిమండ్' ఆర్ట్ థియేటర్లో 'సత్యజిత్‌రాయ్' తీసిన నాయక్' బెంగాలీ సినిమాని చూసి బయటపడ్డాను. సాయంత్రం ఆరు కావటం మూలంగా మౌంటు రోడ్డులో వాహనాల రద్దీ ఎక్కువగా వుంది. నా ఆలోచనలనిండా 'నాయక్' సినిమాయే నిండి పోయింది.

బెంగాలీ సినిమాల్లో బాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్న ఒక మహానటుడు నాయకుడు. తన నటనా ప్రాభవానికి ప్రభుత్వం మెచ్చి యివ్వబోతున్న బహుమతిని అందుకోవటానికి కలకత్తా నుండి ఢిల్లీ ప్రయాణమౌతాడు. ఆ ప్రయాణంలో జరిగిన వివిధ సంఘటనలు, ఆ నాయకుడి మానసిక చిత్రణ — ఈ 'నాయక్' సినిమా. తెలుగువాణ్ణయిన నేను ఆ వంగభాషా చిత్రాన్ని చూడటానికి కారణం, ఆ సినిమాకి దర్శకత్వ వహించిన 'సత్యజిత్‌రాయ్.'

సత్యజిత్‌రాయ్ తత్వం ఒకంతట అర్థం కావటంలేదు నాకు. తను స్వతహాగా ఒక 'మార్క్సిస్ట్' కళాకారుడయి వుండికూడా ఒక బూర్జువా జీవితాన్ని చిత్రించటానికి కారణం ఏమిటో! ? 'ఒక కళాకారుదు బూర్జువాగా మారితే, అతని జీవితంలో ఆ 'కళ' ప్రధమ స్థానాన్ని కోల్పోతుంది' అని నిరూపించటానికా ! ?, లేక, ఒక నటుడి నిజజీవితంమీద అతని నటన ప్రభావం ఎంతవరకూ వుందనా ! ? ఒక కళాకారుణ్ణి ప్రజలు, చుట్టూవున్న భజనపరులు అదేపనిగా పొగుడుతూ వుంటే అతనొక'నార్సిసిస్ట్'గా మారిపోయే ప్రమాదం తప్పనిసరి సుమా అని హెచ్చరించాడా? అలా అయితే రైల్లో, తనొక పత్రికా విలేఖరినని అబద్ధం చెప్పి తనతో పరిచయం చేసుకున్న ఒక అందమైన అమ్మాయిని, తనేమాత్రం ఆకర్షించుకోలేకపోయానని తెలిసిపోయినా, ఆమెకోసం ఎందుకలా తపించాడు? అందనివాటికే విలువనిచ్చే మనస్తత్వం ఒక బూర్జువా కళాకారుడికి తప్పదా? తప్పించుకోవాలని ఎంత ప్రయత్నించినా, ఎంతకీ తప్పించుకోలేక బూర్జువా జీవితానికీ, డబ్బుకీ అతను నిరంతరం బలి కావలసిందేనా ! ?

చాలా ప్రశ్నలకి జవాబులిస్తూ, ఆ జవాబుల తోనే మరిన్ని ప్రశ్నల్ని రేకెత్తించటం 'రాయ్' ప్రత్యేకత కానీ ఒక బూర్జువా జీవితాన్ని 'రాయ్' సినిమాగా తీయటం హర్షించలేకపోయాను.

అసలు కళకీ, కళాకారుడి జీవితానికీ, ఆ రెండింటితో సమాజానికీ గల సంబంధం ఎలాంటిది? — చాలా పెద్ద ప్రశ్న. సామాజిక దృక్పథం గల కళాకారుడికి పూర్తి స్వాతంత్ర్యం వుందా? లేదా?... ...???

ఆలోచిస్తూనే 'టి. నగర్' వెళ్లే బస్సుకోసం ఎదురుచూస్తూ నిలబడ్డాను. నా ఎదురుగా ఒక టాక్సీ వచ్చి ఆగింది. వెనక సీటులోంచి ఒకాయన చెయ్యి వూపాడు. నాకోసం కాదేమో అని చుట్టూ చూశాను. కానీ అతను నావయిపే చూస్తున్నాడు. కాస్త తికమకపడ్డాను. కారు దిగి చిరునవ్వు నవ్వుతూ చూశాడు. వెంటనే పోల్చుకున్నాను. నిరంజనం !

"హలో నిరంజనంగారూ !" అన్నాను ఆశ్చర్యంగా చూస్తూ. చేయి అందించాను. ఆప్యాయంగా రెండు చేతులతో అందుకున్నాడు.

"అమ్మయ్య, పోల్చుకున్నారన్నమాట. రక్షించారు" అన్నాడు ఆనందాన్ని వ్యక్తంచేస్తూ.

"అంత మాటనకండి, మీరు నాకు బాగా గుర్తున్నారు?"—వెంటనే పోల్చుకోలేకపోయినందుకు కొంచెం సిగ్గుపడుతూ అన్నాను.

"నాకు మాత్రం ఆ రోజు మనం 'కోణార్క్'లో గడిపిన ప్రతి క్షణం గుర్తుంది" అన్నాడు స్నేహంలో తనదే పైచేయి అన్నట్టు కాస్త గర్వంగా.

"నిజంగా !"

"ఇంతకీ యిక్కడ నిలబడ్డారేం ?"

"ఏం లేదు — యిప్పుడే సినిమా చూసి బయట పడ్డాను. బస్సుకోసం ఎదురు చూస్తున్నాను."

"అంత అవసరమైన పనా ?"

"అబ్బే — పనేంలేదు. రేపు మధ్యాహ్నం వరకూ ఖాళీయే."

"అలా అయితే మీరు నాతో యిప్పుడే రావాలి. ఈ రోజు నాతో మీరు నా అతిధిగా గడపాలి."

"అదేవిటి? మా వూరికి వచ్చి నాకే ఆతిధ్యం యిస్తున్నారే? — కొంపతీసి ఆ రోజు నా ఆతిధ్యానికి బదులా యిది ?"

"అదేం కాదు — పోనీ, అలానే అనుకోండి — కానీ మీరు అభ్యంతరం చెప్పకండి."

"అభ్యంతరం ఎందుకు? భలేవారే — మీతో గడపడం నాకూ యిష్టమే."

"అయితే రండి — టాక్సీ ఎక్కండి."

. . ఇద్దరం టాక్సీలో కూర్చున్నాం. టాక్సీ కదిలింది.

నిరంజనం పూర్తిగా నావయిపే తిరిగి కూర్చున్నాడు. అతని వైఖరి చూస్తుంటే ఆ రోజున కోణార్క్‌లో అతన్ని బాగా ఆకర్షించాననిపిస్తోంది. ఏదో ఒకటి అడగాలని నోరు విప్పాను, లేకపోతే బాగుండదని.

"నిరంజనంగారూ ! ఈ వూళ్లో ఏం పని మీకు ? మీ వ్యవహారం అంతా ఒరిస్సాయే కదా."

"అవును, కానీ యిక్కడ మా కంపెనీవాళ్లు మా రిప్రజెంటేటివ్ లందరికీ ఒక 'కాన్ఫరెన్సు'ని ఏర్పాటు చేశారు. కొన్ని కొత్త మందుల్ని మా కంపెనీ మార్కెట్లోకి పంపించబోతోంది. మరో వారం రోజులుంటానిక్కడ. అది సరే, రేపు మధ్యాహ్నం మీరు వెళ్లితీరాలా ?"

"తప్పకుండా వెళ్లితీరాలి. మా కొత్త సినిమాకి రేపట్నుంచి మా ప్రొడ్యూసరుగారింట్లో 'మ్యూజిక్

ంాల్లున్నాయి. నముండతిరాలి.

''సరే. రేపు మధ్యాహ్నం వరకూ నాతో వుంటారుగా, చాలు. ఇప్పుడు మనం తిన్నగా నా లాడ్జికి వెళ్దాం. స్నానం చేసి, భోజనం ముగించి ఏదైనా మంచి సినిమాకి వెళ్దాం. ఆ తరువాత...''

''వద్దు. సినిమాకి మాత్రం వద్దు. అసలెక్కడికీ వద్దు, మీ గదిలోనే వుండి మనసారా మాట్లాడుకుందాం. అదే మీరు నాకిచ్చే నాకు నచ్చే ఆతిథ్యం'' అన్నాను కొంచెం హాస్యాన్ని జోడిస్తూ. అతనుకూడా హృదయపూర్వకంగా నవ్వేడు.

'నేషనల్ లాడ్జింగ్స్' దగ్గర టాక్సీ ఆగింది. ఇద్దరం దిగాం. డబ్బులిచ్చి టాక్సీని పంపించేశాడతను. నాల్గంతస్తుల ఆ భవనాన్ని చూస్తూ అడిగాను.

''మీ మెడికల్ రిప్రజెంటేటివులు సాధారణంగా యిలా లాడ్జింగుల్లో కాక వేరేగా ప్రతి పట్నంలోనూ 'మెస్'లు ఏర్పాటు చేసుకుని అక్కడే వుంటుంటారనుకుంటాను. మరి మీరు యిక్కడ దిగారేం ?''

''నేను మాత్రం వీలయినంతవరకు యిలా లాడ్జిల్లోనే వుంటుంటాను. ఆ మెస్సులు నాకు నచ్చవు. నా వృత్తికి సంబంధించిన ఆ ప్రపంచానికి దూరంగా — ఏకాంతంగా వుండటానికే ప్రయత్నిస్తుంటాను. ఒక 'మెడికల్ రిప్రజెంటేటివ్'కి యిలాంటి ఆలోచనలు వుండకూడదు కదూ !'' అన్నాడు నా భుజాన్ని చరిచి కొంచెం బిగ్గరగా నవ్వుతూ. అంతగా నవ్వాల్సిన విషయం అందులో ఏముందో నా కర్థంకాలేదు.

కిందటి వేసవి రోజుల్లోనే నేను కోణార్క్ వెళ్ళాను. మేం తీయబోయే ఒక శృంగారభరిత చిత్రానికి కావలసిన 'ఔట్‌డోర్ షాట్స్' కోణార్క్‌లో తీయాలని మా 'ప్రొడ్యూసర్' గారికి కోరిక పుట్టింది. మా 'డైరెక్టర్'గారు కూడా సరే నన్నారు. 'లొకేషన్స్' తాలూకు ఫోటోలు తీసుకు రమ్మని నన్ను పంపించారు. మేం తీయబోయే చిత్రం రంగుల్లో కాబట్టి ఒక 'కలర్' రీలు నింపి 'రోలీఫ్లెక్స్ — ఎస్. ఎల్. 66' కెమేరాని, మామూలుగా నేనెప్పుడూ తీసుకువెళ్లే 'యషికా — లిన్క్స్' 35 ఎం. ఎం. కెమేరాలో తెలుపు నలుపు రీలు నింపి, రెండు కెమేరాలని వాటితోపాటు నా 'ఎలక్ట్రానిక్ ఫ్లాష్‌గన్'ని పట్టుకుని బయల్దేరాను కళింగ రాజ్యానికి.

కోణార్క్‌లోని శిథిలావస్థలో వున్న సూర్య మందిరాన్ని, మందిరంపై కళింగ శిల్పులు చెక్కిన ఆ అమర శిల్పాల్ని చూడగానే నన్ను నేనే మరచిపోయాను. ఒక్కొక్క శిల్పాన్నే తదేకంగా చూస్తూ తన్మయత్వం చెందుతూ, శిథిలమైపోయిన ఆ శిల్పాల్ని చూసి విచారిస్తూ చాలాసేపు గడిపేశాను. కర్తవ్యం వెన్ను తట్టగా మేం 'హీరో, హీరోయిన్ల' మీద తీయబోయే ఒక పాట కోసం కావలసిన శృంగార శిల్పాల్ని రంగుల రీలుమీద, నాక్కావలసిన వాటిని నా కెమేరాలోని నలుపు తెలుపు రీల మీద ఎలాగో కష్టపడి తీస్తున్నాను. ప్రయాణంలో ఎలా జరిగిందో గాని నా ఎలక్ట్రానిక్ ఫ్లాషగన్ పాడయింది.

ఒక ఆరేడడుగుల పురుష విగ్రహం నన్ను చాలా ఆకర్షించింది. అరమోడ్పు కనులతో ప్రశాంత వదనం. రెండు చేతుల్ని విరగ్గొట్టేశారెవరో. కాని, ఆ వదనంలో ప్రశాంతత చెక్కుచెదరలేదు. యథాతథంగా కెమేరా కెక్కించాలని కోరిక పుట్టింది. రంగుల్లో అయితే మరింత శోభిస్తుంది. కానీ ఆ విగ్రహంమీద బాగా నీడ పడుతోంది. నా దగ్గరున్న కలరు ఫిల్ము '16 ఏ. ఎస్. ఏ. స్లో' ఫిల్ము, ఫ్లాష్ లైట్ వుంటేనేగాని లాభంలేదు. 'టైమింగ్' యిచ్చి తీస్తే అవుతుంది కాని కెమేరాని నిలకడగా వుంచి తీసేందుకు అవకాశం లేదు. 'అపర్చర్'ని పూర్తిగా తెరచి తీస్తే అవుతుంది కానీ నాక్కావలసిన 'డెప్త్ ఆఫ్ ఫీల్డు' వుండదు ఫోటోలో. ముఖ్యంగా ఆ వదనంలోని ప్రశాంతతనీ, ఆ అరమోడ్పుకనుల అందాన్ని తీయాలంటే 'డెప్త్' వుండాలి. దానికి 'ఫ్లాష్' కావాలి. ఫ్లాష్‌గన్ పాడయినందుకు నన్ను నేను మరీ తిట్టుకున్నాను. నా 'యషికా'తో రెండు 'స్నాప్స్' తీశానుగానీ: అది తెలుపు నలుపు రీలు. ఎండ బాగా వచ్చేంతవరకూ వేచివుండాల్సిందేనా అని ఆలోచిస్తున్నాను. ఇంతలో ఎవరో ఒకతను '35 మి. మి. ఒలింపస్' కెమేరాకి ఎలక్ట్రానిక్ ఫ్లాష్‌గన్ తగిలించి ఫోటోలు తీస్తున్నాడు.

'అతన్నొకసారి ఆ 'ఫ్లాష్'ని అడిగితే? ఇస్తాడా? ఇవ్వనంటే...? పరువు పోతుంది. కానీ... సిగ్గుపడితే లాభంలేదు. కళాకారుడికి కళ ముఖ్యం. తిన్నగా వెళ్లి అడిగాను, యింగ్లీషులో చాలా మర్యాదగానే. అతను వెంటనే అడిగాడు, ''మీరు తెలుగువారా'' అని. నా యింగ్లీషులో తెలుగుతనం అంత ప్రస్ఫుటంగా వుందా అని ఆశ్చర్యపోతూ అవునన్నాను

''నేనూ తెలుగువాణ్ణే ! నా పేరు నిరంజనం. 'ఫైజర్' కంపెనీలో మెడికల్ రిప్రజెంటేటివుగా పని చేస్తున్నాను.'' అని చేయి అందించాడు.

''నా పేరు ఆనందరావు. ప్రఖ్యాత తెలుగు సినిమా దర్శకులు శ్రీ రాఘవరావుగారి పేరు వినే వుంటారనుకుంటాను. ఆయన దగ్గర నేను 'ఎసోసియేట్'గా పని చేస్తున్నాను '' అన్నాను అతని చేయినందుకుని స్నేహపూర్వకంగా.

''ఓహో ! మీరు సినిమావాళ్లన్నమాట'' అన్నాడు కళ్లెగరేస్తూ. మద్రాసులో అయితే ఎవడూ పట్టించుకోడుగానీ, యిలా పై వూళ్లకి వచ్చినపుడు సినిమావాళ్లకి మంచి గౌరవం లభిస్తూ వుంటుంది. ఏదో వింత లోకంనుండి వచ్చిన వ్యక్తుల్లా కనిపిస్తారేమో.

''ఇంత దూరం వచ్చారేం ? ఒరిస్సా చూద్దామని బుద్ధి పుట్టిందా ?'' అని అడిగాడతనే మళ్లీ.

''మా తదుపరి చిత్రానికి కావలసిన 'ఔట్‌డోర్ షాట్స్'కి ఈ కోణార్క్ ఏమైనా బాగుంటుందేమో అని, చూసిరమ్మని, వీలయితే ఫోటోలు తెమ్మని మా ప్రొడ్యూసరుగారు నన్ను పంపించారు.''

''ఒరిస్సామీద కన్ను పడిందే మద్రాసువాళ్లకి. ఏమిటో మీ సినిమా ప్రత్యేకత ?''

''ప్రత్యేకతేంలేదు. రహస్యం చెప్పమంటారా ? మేం తీయబోయేది కొంచెం శృంగారభరితం. ఈ కోణార్క్ శిల్పాలు శృంగార రసంతో నిండి వుంటాయని మా ప్రొడ్యూసరుగారికి ఎవరో చెప్పారు. ఇటు ప్రాచీన కళ పేరుతో వీటిని చూపిస్తూ అటు శృంగారాన్ని యిష్టం వచ్చినట్టు గుప్పిస్తూ, కళాత్మక చిత్రం అని ప్రశంసలతో సెన్సారువారి కత్తెరపాట్లునుండి తప్పించుకోవటానికి యిదొక ఎత్తుగడ'' అన్నాను కన్నుగీటుతూ.

నిరంజనం బిగ్గరగా నవ్వేడు. అలా నవ్వుతూనే అడిగాడు — ''ఫ్లాష్‌గన్ అడిగారు — మరి ఏ శృంగార శిల్పాన్ని తీద్దామని''.

''అది కాదు — నాకోసం. ఎంత అమ్ముడుపోయిన కళాకారుణ్ణయినా, అప్పుడప్పుడీ కళాహృదయం స్పందిస్తూ వుంటుంది. చూడండి; యీ ఎత్తయిన పురుష విగ్రహాన్ని. ఎంత నిండుతనం ! ఆ వదనాన్ని చూశారా ? ఎంత ప్రశాంతత ! ఏ శిల్పి అపూర్వ సృష్టో యిది ! ? అలా ఆ మెళ్లో జంధ్యం చూడండి. జంధ్యానికి వేళ్లాడుతూన్న చిరుకుచ్చెలు, మొలకున్న వెడల్పు పటకా, కొళికి బిళ్లా, యెంత అందంగా చెక్కాడో శిల్పి ! ఆ పటకాకి వేలాడుతూ తొడలనంటుతూన్న చిరుగంటలు ఎంత రమ్యంగా వున్నాయని ! ఆ గంటల నాళికలనుండి వేలాడుతూన్న తాళ్లూ, వాటి చివర కుచ్చెళ్లూ, ఆ కుచ్చెళ్ల చివర పాదాలనంటి జీరాడుతూన్న బ్రహ్మాండమైన పతకం — ఎంత నేర్పుగా చెక్కాడో ! సాక్షాత్తూ ఆ దేవుణ్ణే ఈ శిల్పంలో బంధించేశాడు కదూ'' — అన్నాను తన్మయత్వంతో.

''చక్కగా చెప్పారు. ఆ పక్కనున్న ఎనిమిది విగ్రహాలు చూడండి. అవి మిగతా ఎనిమిది గ్రహాల శిల్పాలు. మీకు నచ్చినది యీ మందిరంలో ప్రతిష్ఠించవలసివుండిన సూర్యభగవానుడి విగ్రహం'' అన్నాడు నిరంజనం.

అక్కణ్ణుంచి యిద్దరం కలిసి చాలా ఫోటోలు తీశాం. అతనికి కెమేరాని వాడటం యింకా సరిగా రాదు. కొత్తగా కొన్నాడట. అతనికోసం కూడా నేనే ఫోటోలు తీశాను. కెమేరా భాషని కొంత నేర్పించాను. అతని 'ఫ్లాష్‌గన్'ని నాకోసం బాగా వుపయోగించుకున్నాను.

పదమూడవశతాబ్దంలో యీ కోణార్క్ మందిరాన్ని నిర్మించిన కళింగరాజు నృసింహదేవు గురించి, కోణార్క్ మందిరాన్ని, ఆ విగ్రహాల్ని చెక్కిన ఆ స్థపతి బిసుమహరణా, అతని కుమారుడు ధర్మపాదుడు గురించి, వారి శిల్పకళా నైపుణ్యం గురించి, పూరీ భువనేశ్వర్ల ప్రశస్త్యాన్ని, ఓఢ్రవీరుల ప్రతాపం — చాలా విషయాలు చెప్పాడు నిరంజనం. తను జన్మతః తెలుగువాడేకానీ, పెట్టి పెరిగినది, విద్యాబుద్ధులు నేర్చినది ఒరిస్సాలోనేనట. కొద్దిసేపట్లోనే అతడికీ నాకు చాలా స్నేహం కలిసింది. చాలా చనువుగా మాట్లాడుకున్నాం.

''పున్నమి రాత్రుల్లో కోణార్క్ సముద్రతీరం చాలా అందంగా వుంటుంది. ఈ మందిరంకూడా చాలా బాగుంటుంది. ఈ రాత్రి మీరిక్కడ వుంటున్నారా ?'' అని అడిగాడు నన్ను.

''ఉండాలనేకదా యింత దూరం వచ్చాను. మీరుకూడా వుండరాదూ. 'ఇన్‌స్పెక్షన్ బంగ్లా'లో నా రూములో వుండండి. ఈ వెన్నెల రాత్రిలో యివన్నీ తిరుగుదాం. సరదాగా వుంటుంది. ఇక్కడ

(34 వ పేజీ చూడండి)

# సినిమా విశేషాలు



'తిరుగులేని మొనగాడు'లో పద్మప్రియ

**ఈ వింత విన్నారా ?**

లక్ష్మీజ్యోతి ఫిలింస్ వారి "చిల్లరకొట్టు చిట్టెమ్మ" చిత్రం ఎదుర్లంక, యానాం, పొడూరు, కొమరగిరి, మురమండ్ల మున్నగు ప్రదేశాల్లో పూర్తయినట్టు పాఠకుల కిదివరకే తెలిపాం. ఆ చిత్రం షూటింగ్ ఎక్కువభాగం పొడూరులో జరిగింది. షూటింగ్ జరుగుతున్న సమయంలో జరిగిన కొన్ని వింత సంఘటనలను కూడా మీ దృష్టికి తెచ్చాను యిదివరకే. అక్కడ జరిగిన మరో వింతను గూర్చి తెల్పుకుందామా ! "పొడూరు"లో షూటింగ్ జరుగుతుండగా, కొచ్చాం షూటింగ్ అని ఆ వింతను గూర్చి ప్రస్తావించారు "చిట్టెమ్మ" నిర్మాత ఆర్. యస్. రాజుగారు. "మా దర్శకులు దాసరి నారాయణరావు గారు కనపర్చిన శ్రద్ధాసక్తులు మేము చిత్రాన్ని త్వరగా పూర్తిచేయడానికి ఎంతో దోహదం చేశాయి. మా డైరెక్టర్‌గారికి మా చిత్రంలోని నటీనటులకు, సాంకేతిక పరివారానికి, షూటింగ్ సమయంలో మాకెంతగానో సహకరించిన కేశవరం పుర ప్రజలకు నా అభిమానపూర్వక కృతజ్ఞతలు చెప్పడానికి నాకు చాలా ఆనందంగా వుంది" అన్నారు లక్ష్మీజ్యోతి అధినేత ఆర్. యస్. రాజుగారు.

**చిట్టెమ్మగా చిత్ర**

"చిల్లరకొట్టు చిట్టెమ్మ"గా జయచిత్ర దాసరిగారి కలాన్ని, రమేష్‌నాయుడిగారి సంగీతాన్ని, భాస్కరరాజుగారి కళను, జి. జి. కృష్ణారావుగారి కూర్పును అభినందిస్తూ, టోటల్‌గా పిక్చర్ బాగుందనిపించేందుకు అవన్నీ తోడ్పడ్డాయంటు న్నారు ఇంకొందరు.

జయచిత్ర, మురళీమోహన్, గోకిన రామారావు, బెనర్జీ, కె. వి. చలం, మాడా, ఉషాచౌదరి, నిర్మల, మల్లాది, జయవిజయ, పి. హెచ్. కృష్ణమూర్తి, అప్పారావు ముఖ్య పాత్రలను పోషిస్తున్న యీ చిత్రానికి కె. దుర్గానాగేశ్వరరావు కో-డైరెక్షన్ను, నందం హరిశ్చంద్రరావు, కోడి రామకృష్ణ సహకార దర్శకత్వమును సమకూరుస్తున్నారు. జూలైలో యీ చిత్రం తారకరామా ద్వారా విడుదలౌతుంది.

**జయచిత్రతో కాసేపు**

ఆ రోజు జూన్ 2వ తేదీ అనుకుంటా. ఆరోజే లక్ష్మీజ్యోతి ఫిలింస్‌వారి "చిల్లరకొట్టు చిట్టెమ్మ" చిత్రం డబ్బింగ్ వాహూ స్టుడియోలో ప్రారంభమైంది. "ఏదైనా వ్యాపారం పెద్దామని, ఏదైనా సిల్లరకొట్టు పెడ్తామని" అంటూ మైక్ ముందు నిలబడి తెరమీద ఆ సన్నివేశాన్ని చూస్తూ తదనుగుణంగా డైలాగ్స్ చెప్తూ కన్పించింది చిట్టెమ్మ పాత్రధారి జయచిత్ర. ఆ టేక్ ఓకే శ్రీ కె. బాలచందర్‌గారి బృందం కూడా మాతో సింగపూర్ వస్తున్నారు. సింగపూర్, మలేషియా దేశాలను దర్శించి జూలై 12వ తేదీ ఇండియాకి వచ్చేట్టు షెడ్యూల్ వేసుకున్నాము" అంది నూతన గృహప్రవేశ సుందరి జయచిత్ర

**శోభన్... లాల్ చిత్రం**

లక్ష్మీ ఫిలింస్ కంబైన్స్ నిర్మిస్తున్న భారీ వర్ణచిత్రం జూలైలో యిరవై రోజులు జరగడానికి వీలుగా, శోభన్‌బాబుగారు కాల్‌షీట్లు యిచ్చారు.

ఉత్తమ నటన్ను, వైవిధ్య పాత్ర పోషణ్ను ప్రదర్శించే అవకాశం వున్న రెండు వేషాలను శోభన్ యీ యాక్షన్ థ్రిల్లర్‌లో నటించడం శుభావహం.

యాక్షన్ చిత్రాల మాస్టరు ఎస్. డి. లాల్ దర్శకత్వం యీ చిత్రానికి వన్నె చేకూర్చగలదు.

ఈ చిత్రంలో శోభన్‌కు యిద్దరు హీరోయిన్లు వుంటారు. ఒక పాత్రను జయచిత్ర, మరొక పాత్రను దీప పోషించగలరని తెలిసింది.

ఈ చిత్రాన్ని అనూరాధాదేవి నిర్మిస్తున్నారు.

**సంగీత గీతను మార్చే సీత**

"ముత్యాలముగ్గు" చిత్రం అఖండవిజయాన్ని సాధించినా, ఆ చిత్ర నాయిక సంగీతకు సానుకూలమైన వాతావరణం ఏర్పడిందికాదు.



ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో అంతా వర్షం జోరుగా పడేదట. అదేం విడ్డూరమో గానీ "పోడూర్"లో మాత్రం ఒక్క చినుకుకూడా పడలేదట. ఏప్రిల్ 10 నుంచి మే 5 వరకు షూటింగ్ జరిగితే ఒక్కరోజు కూడా పోడూర్‌లో వర్షం పడలేదట. షూటింగ్ పూర్తయి యూనిట్ మే 6 వ తేదీ అటు మద్రాస్‌కు బయల్దేరగానే కుండపోతగా వర్షం పడడం ప్రారంభమైందట. ఇలా జరగడం మా అదృష్టం. లేకుంటే వేసుకున్న షెడ్యూల్స్ అన్నీ వేస్ట్ అయిపోయేవి. వర్షం లేదు గనుకనే సవ్యంగా సక్రమంగా పూర్తిచేసు

ప్రదర్శించిన నటన బహుధా ప్రశంసనీయంగా వుందని, ఆమె చలనచిత్ర జీవితంలో ఆ పాత్ర చెరిగిపోని ముద్రగా నిలిచిపోతుందని రషస్ చూచిన వారంతా అభిప్రాయపడుతున్నారు. దర్శకులు దాసరి నారాయణరావుగారి పనితనం యీ చిత్రంలోని ప్రతి ఫ్రేములో కన్పిస్తున్నదని, దాసం గోపాలక్రిష్ణగారు వ్రాసిన యీ నాటకాన్ని సినిమాటిక్‌గా తీయడంలో దాసరి స్పెషల్ కేర్ తీసుకున్నట్టు గోచరిస్తున్నదని పల్వురు చెప్పుకుంటున్నారు చెన్నపట్నంలో.

'ప్రజలకోసం'లో మంజుల






'మంచిని పెంచాలి'లో పద్మనాభం

అవగానే నెక్స్ట్ లూప్ అంటూ కేకేసారు కో-డైరెక్టర్ దుర్గానాగేశ్వరరావు. కాస్త గ్యాప్ దొరికింది. జయచిత్రను సమీపించి "గృహప్రవేశం" శుభంగా ముగిసిందనుకుంటాను. సింగపూర్ ప్రయాణం ఎప్పుడు" అనడిగాను.

"దైవానుగ్రహంవల్ల గృహప్రవేశం బాగానే జరిగింది. మామీద గల ప్రేమతో తెలుగు, తమిళ చలన చిత్ర ప్రముఖులు, సాంకేతికేయులు, నాతోటి నటీనటులు మా గృహప్రవేశానికి విచ్చేసి మాకెంతో ఆనందాన్ని కల్గించారు. వారందరికీ నా వినయ పూర్వక కృతజ్ఞత అర్పించుకుంటున్నాను. జూన్ 23వ తేదీ సింగపూర్ బయల్దేరుతున్నాము" అంది జయచిత్ర.

"ఫారిన్ ట్రిప్ మీకిది రెండోసారి కదూ" అనడిగాను. "కరెక్ట్. విదేశయానం చేయడం యిది రెండోసారే. లోగడ రష్యా వెళ్ళొచ్చాను. ఇప్పుడు సింగపూర్ వెళ్తున్నాను. సింగపూర్ కూడా ఎప్పుడో '75 లోనే వెళ్లాల్సింది. అనివార్య పరిస్థితులవల్ల అది '76 కు వాయిదా పడింది. '76లో కూడా కొన్ని కారణాలవల్ల పోలేకపోయాను. సింగపూర్‌లో నాకు చాలామంది ఫాన్స్ వున్నారు. వాళ్ళు పిల్చిన రెండుసార్లూ నేను వెళ్లలేకపోయినందుకు బాధ పడ్డాను. "హాపీ ట్రిప్ మిస్ చేసేసానే" అనుకుంటుండేదాన్ని. వాళ్లూరుకోలేదు. '77వ సంవత్సరంలో కూడా నన్ను ఆహ్వానించారు. ఈసారి పట్టు బట్టాను. ఓ 20 రోజులు షూటింగ్ లేకుండా డేట్స్ అడ్జెస్ట్ చేసాను. జూన్ 23వ తేదీ

మంచిరోజు రాకపోతుందా అని సంగీత నమ్మినందుకు తగిన ప్రతిఫలం రానేవచ్చింది.

"నటరత్న"గారిని యిటీవల "సతీసావిత్రి" సెట్లో కలిసినప్పుడు, సీత పాత్రకు సంగీతను ఎంపికచేసినట్టు చెప్పారు.

రామారావుగారి "శ్రీరామ పట్టాభిషేకం" చిత్రంలో సీత పాత్ర తన కొస్తుంది ... తనకే వస్తుంది అని యెందరో ఆశించారు.

"సీత" పాత్ర సంగీతను వరించింది. సంగీత గీతను సీత పాత్ర మారుస్తుంది.

## గోపీనాథ్ కొత్త చిత్రం

"తల్లే చల్లని దైవం" చిత్రాన్ని అనుకున్న ప్రకారం ఒకటిన్నర నెలలో పూర్తిచేసిన నిర్మాత గోపీనాథ్ జూన్‌లో కొత్త చిత్రానికి సంబంధించిన కథను, ఆ కథకు కావలసిన చిత్రానువాదాన్ని రెడీ చేశారు.

ఇరవై రోజులలో పూర్తిచెయ్యదలచినట్టు, "నేటి పిల్లలు భావి నాయకులు" అనేది అంశంపై కథను అల్లినట్టు, దర్శకుడుగోపీనాథ్ తెలియచేశారు.

ఇద్దరు పసిపిల్లలు ముఖ్య పాత్రలను పోషించ గలరని, సహాయ పాత్రలను ప్రముఖులు నిర్వహించ గలరని, కథకుడు గోపీనాథ్ చెప్పారు.

చిత్రానికని, గూడూరు సమీపాన గల చిన్ని గ్రామాన్ని ఎంపిక చేసినట్టు చెప్పారు.



# సినిమా

## అజయ్ ఆర్ట్స్!

"జైహింద్ సత్యం" నెలకొల్పిన అజయ్ ఆర్ట్స్ అక్టోబర్ నుంచి ఆరంభించనున్న వర్ణ చిత్రానికి కథ రెడీ అయినట్టు, నిర్మాత తెలిపారు.

"జైహింద్" నిర్మించనున్న చిత్రంలో ముగ్గురు విజేతలు పాల్గొనడం విశేషం. ఆ ముగ్గురు ఎవరన.

హీరో నాగేశ్వరరావు...హీరోయిన్ వాణిశ్రీ... దర్శకుడు తాతినేని రామారావు.

## తాతినేనివి మూడు చిత్రాలు

ఈ సంవత్సరం తాతినేని రామారావుగారివి మూడు చిత్రాలు వస్తాయి. మూడు చిత్రాలలో "సూపర్ స్టార్స్" నటించడం గమనార్హం. శ్రీ ఎస్. వెంకటరత్నంగారి "యమగోల" చిత్రంలో ఎన్టీఆర్, వడ్డె శోభనాద్రి, జైహింద్ సత్యంగార్ల చిత్రాలలో నాగేశ్వరరావు ప్రధాన పాత్రధారులు

## అ...ఆల విజయం!

జనవరి నుంచి జూన్ వరకు విడుదలయిన చిత్రాలలో ఆంధ్ర ప్రేక్షకుల ఆదరణను అత్యధికంగా నూరగొన్న చిత్రాలు రెండే కనిపిస్తున్నాయి.

ఒకటి: సత్య చిత్ర వారి "అడవిరాముడు."
రెండు: పి. ఏ. పి. వారి "ఆలుమగలు." అ...ఆల విజయం సూపర్ స్టార్స్‌కు జనంలో వున్న ఇమేజ్‌కి ప్రత్యక్ష నిదర్శనం.

అ...ఆల చిత్రాలకు దర్శకత్వం వహించిన రాఘవేంద్రరావు ... రామారావుగార్లకు ప్రేక్షకు లిచ్చిన ఘనస్వాగతాన్ని పరిరక్షించుకోవాలని ... కాపాడుకుంటారని యీ విలేఖరి నమ్ముతున్నాడు.

అక్కినేనికి "ఆలుమగలు", నందమూరికి "అడవిరాముడు" సూపర్‌హిట్ చిత్రాలు.

'మల్లెపూవు'లో జయసుధ, శోభన్

## మల్లెపూవులో అద్భుత నటన

సమత ఆర్ట్స్ రంగుల్లో నిర్మించిన "మల్లెపూవు" చిత్రం జులై విడుదల అవుతుందని తెలిసింది. మంచి కథలను... సజీవ కథలను కోరే ప్రేక్షకులకు యీ చిత్రం పరిపూర్ణ తృప్తి నిస్తుంది.

ఈ చిత్రంలో శోభన్ అద్భుతంగా నటించ డానికి అపురూపమైన పాత్ర లభించింది. కరుణరస పోషణలో దిట్ట అని యీ చిత్రం ద్వారా శోభన్ ప్రజల మెప్పును పొందగలరు.

"మల్లెపూవు" వర్ణచిత్రంలో లక్ష్మి, జయసుధ, శ్రీధర్, రావు గోపాలరావు, నిర్మల, కె. విజయ ముఖ్య పాత్రలను పోషించారు.

ఈ చిత్రంలో పాటల కర్త వీటూరికి, సంగీత కర్త చక్రవర్తికి అనంతమైన కీర్తి... తథ్యము. శ్రీ యాచేంద్ర... చటర్జీగార్లు నిర్మించిన యీ శృంగార, కరుణ, వినోదభరిత చిత్రానికి వి. మధుసూదనరావు దర్శకుడు. "మల్లెపూవు" చిత్రానికి ఎస్. వెంకటరత్నం, ఎస్. కృష్ణారావు, అంకిరెడ్డి ముఖ్య సాంకేతిక సారధులు.







# నోటి దుర్వాసనను ఆపండి... కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో దంతక్షయాన్ని ఎదుర్కోండి

ప్రతిసారీ భోజనం చేసిన తర్వాత, కోల్గేట్‌తో మీ పళ్ళను తోముకోండి. కోల్గేట్, ప్రపంచమంతటా దంత వైద్యులు సిఫారసు చేసే తీరులో మీకు రక్షణ సమకూరుస్తుంది.

మీ పళ్ళలో మిగిలిపోయే ఆహారపు అణువులలో బాక్టీరియా పెరుగుతుంది. అవి ముందు నోటి దుర్వాసన, ఆపైన బాధాకరమైన దంతక్షయాన్ని కలిగిస్తాయి.

అందుకే మరి ఎప్పుడూ భోజనంకాగానే కోల్గేట్‌తో తోముకోవడం సరైన మార్గం. అది మీ శ్వాసను తాజాగా రూపొందించేందుకు, పళ్ళను తెల్లగా మెరిసేలా చేసేందుకు, దంతక్షయాన్ని ఎదిరించేందుకు అమోఘమైనదని రుజువయింది.




కోల్గేట్ యొక్క నమ్మకమైన సూత్రీకరణ ఎలా పనిచేస్తుందంటే...



మీ పళ్ళలో ఇరుక్కుపోయిన ఆహారపు అణువులలో దుర్వాసన, దంతక్షయాన్ని కలిగించే బాక్టీరియా పెరుగుతుంది.



కోల్గేట్ యొక్క సాటిలేని చర్యగల నురుగు బాగా లోతుకుచేరి హానికరమైన ఆహారపు అణువులను బాక్టీరియాను తొలగిస్తుంది.



ఫలితం: ఆకర్షణీయమైన తెల్లని పళ్ళు, శ్వాస తాజాగా ఉందన్న నమ్మకం, దంతక్షయంనుండి రక్షణ.

హాయినిగొల్పే, తాజా శ్వాసకోసం, పళ్ళను తెల్లగా రూపొందించేందుకు ప్రపంచంలో ఎక్కువమంది, మరే ఇతర టూత్‌పేస్ట్ కన్నా ఎక్కువగా కోల్గేట్‌నే కొంటూ ఉంటారు!

**ఒక్క దంతవైద్యులు మాత్రమే దీనికన్న మేలైన దంతరక్షణ సమకూర్చగలరు.**

DC.C.631 TL

### సింగీతంగారి నవలా చిత్రం

మనకున్న మంచి దర్శకులలో సింగీతం కూడా ఒకరు అని జనం ప్రూవ్ చేశారు ఆయన రూపొందించిన చిత్రాలన్నీ కాస్తో...కూస్తో జనామోదాన్ని పొందాయి.

ప్రముఖ నవలా రచయిత్రి మాదిరెడ్డి సులోచన వ్రాసిన "తరం మారింది" నవలను, విశ్వభారతీ మూవీస్ వారి కని చలనచిత్రంగా



'తరం మారింది'లో శ్రీధర్

## సినిమా

రూపొందించారు, సింగీతం.

అంతస్తుల తారతమ్యాలకు, కులమత విద్వేషాలకు ఆతరానికి ... యువతరానికి జరిగిన సంఘర్షణ సారమే "తరం మారింది" చిత్రంలోని ప్రధాన అంశము.

ఈ నవలా చిత్రానికి పి. ఎస్. రావ్ రచన్ను, బాలుమహేంద్ర ఛాయా గ్రహణాన్ని, జి. కె. వెంకటేష్ సంగీతాన్ని నిర్వహించారు.

యువతరం ప్రతినిధిగా శ్రీధర్, ఆయన సహధర్మచారిణిగా పల్లవి నటించిన "తరంమారింది" చిత్రంలో లక్ష్మీకాంత్...రాజకుమారి...దాశరధి...శోభ...జి. ఎస్. ఆర్. మూర్తి, జి. సత్యనారాయణ, ప్రసాదరావు, పంచనాథ్, సత్యవతి, సీతాలత, కమల సహాయ పాత్రధారులు.

ఈ తరం ప్రజకు నచ్చే అంశతో వున్న "తరం మారింది" చిత్రం. నిర్మాత రాధాకృష్ణ మూర్తి జాతకాన్ని మార్చాలి.

### సింగీతంగారి పంతులమ్మ

నవతచిత్ర నిర్మిస్తున్న మూడవ చిత్రం ఆగస్టులో సెట్స్‌కు వెళ్తుందన్న వార్తను కథకుడు, నిర్మాత కృష్ణంరాజు చెప్పారు.

నవత చిత్రకు, సింగీతం దర్శకత్వం నిర్వహిస్తున్న మూడవ చిత్రం యిది. ఈ చిత్రానికి "పంతులమ్మ" అని పేరిడినట్లు, లక్ష్మి...రంగనాథ్ ప్రధాన పాత్రలను పోషించనున్నట్లు, "జయ"ల్లో ఒకరు యింకొక ముఖ్య భూమికను ధరించనున్నట్లు నిర్మాత శ్రీరాజు తెలిపారు



'తల్లే చల్లని దైవం'లో మురళీమోహన్, ప్రభ

## సినిమా

### "జీవనతీరాలు" సంక్షిప్త కథ

గోపీకృష్ణా మూవీస్‌వారి "అమరదీపం" వర్ణ చిత్రం షూటింగ్ వాహినీలో జరుగుతూందారోజు. సెట్లో సందడేమిటో చూద్దామని ఫ్లోర్‌లో కడుగెట్టాను. దర్శకుడు కె. రాఘవేంద్రరావు, సహదర్శకుడు జి. సి. శేఖర్, హీరో కృష్ణంరాజు గారు, సత్యనారాయణ మాట్లాడుకుంటూ కన్పించారు. అందరితో మాట్లాడడం పూర్తయ్యాక శేఖర్‌గార్ని పరామర్శించాను. "ఏమిటి శేఖర్‌జీ! ఎప్పుడు మీ జీవనతీరాలు" అనడిగాను. "జూన్ ఆఖరులో చెయ్యాలనుకుంటున్నారు మా నిర్మాత పి. గోపాలకృష్ణగారు" అన్నారు శేఖర్. మీ చిత్రం టైటిల్‌ను గూర్చి రెండు ముక్కలు చెప్పగలరా అనడిగినందుకు 'పెంచిన ప్రేమకు, పెరిగే మమతకు అంకితమయ్యే హృదయాల హృదయవిదారక గాథే మా జీవనతీరాలు. మరి పాత్రల విషయానికొస్తే, "బస్తీమే సవాల్ ఈ లోకం జబ్బుమీద సవాల్, వాగుతున్న ఈ నోళ్ళు మూయిస్తాను. వారిచేత ఓయబ్బా అనిపిస్తాను" అంటూ సమాజంలోని మలినాన్ని కడిగివేయాలనుకునే పాత్ర ఒకటైతే, "ఇదేమి లోకమురా మనకెందుకు ఖాతరురా, బలేజోరుగా బలాదూరుగా దునియా దున్నేద్దాం" అంటూ మరొక పాత్ర, "కెరటానికి ఆరాటం తీరం చేరాలని, తీరానికి ఉబలాటం ఆ కెరటం కావాలని అందుకే ఈ ఆరాటం" అంటూ ఒక జంట, "నీ కన్నులలో కలనై నీ కౌగిలిలో చలినై వుండిపోనివ్ ఓడిపోనివ్" అంటూ మరొక జంట, "పడిరేయి అవుతూవున్నా నిదురేల రాదు నీకు విధి నన్ను వంచిస్తున్నా కథ ముగియదేల నాకు" అని ఒక అభాగిని, "ఏ రాగమని పాడను, ఏ తీగనని మీటను" అంటూ మరొక దురదృష్టవంతురాలు — ఇలా రకరకాల మనస్తత్వాల మనుగడల మలుపులకు బాట వేసిన కథే మా జీవనతీరాలు' అని కథను క్లుప్తంగా చెప్పారు శేఖర్.



'చిరంజీవి రాంబాబు'లో ఒక దృశ్యం

### శేఖర్‌కు శివాజీ ప్రశంస

శేఖర్ చాలా అదృష్టవంతుడు. పన్నెండేళ్ళుగా చిత్ర పరిశ్రమలో శ్రమిస్తున్న శేఖర్‌కు మారుతీ కంబైన్స్ అధినేత గోపాలకృష్ణగారు ఒక పెద్ద బాధ్యత నప్పగించారు. శివాజీ, కృష్ణంరాజు, జగ్గయ్య, వాణిశ్రీ, జయసుధ మున్నగు మల్టీస్టార్స్ వున్న కాస్టీ చిత్రాన్ని శేఖర్ డైరెక్ట్ చేయడం అదృష్టం కాదంటారా! ఆ అదృష్టాన్ని శేఖర్ సద్వినియోగపర్చుకున్నట్టు పదుగురు సర్టిఫై చేయడం మరింత అదృష్టం కాదా! తమిళ నటసామ్రాట్ శివాజీగణేశన్ శేఖర్ సిన్సియారిటీని, డేరింగ్ నేచర్ని మెచ్చుకుంటూ, కాంప్లిమెంట్ చేసారట. వాణిశ్రీగారు శేఖర్ని అభినందిస్తూ, "సన్నివేశాలను డ్రమటైజ్ చేసి తీయడంలో శేఖర్‌గారు నూరు శాతం విజయం సాధించారు" అని అభినందించారట.

సత్యానంద్, వి. యస్. ఆర్. స్వామి, చక్రవర్తి, రాజేంద్రకుమార్ మున్నగు సాంకేతిక నిపుణుల సాంకేతిక బలంతో సారవంతంగా తయారైన "జీవనతీరాలు" చిత్రాన్ని కాంప్రమైజ్ లేకుండా భారీ ఎత్తున నిర్మించిన గోపాలకృష్ణగారు అభినందనీయులు. "సమర్థవంతులైన నటీనటులతో, నిపుణులైన సాంకేతిక వర్గంతో కల్సి పనిచేసే భాగ్యాన్ని కల్గించిన గోపాలకృష్ణగారికి, కుమార్ గారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు. అలాగే నా కెన్నోవిధాల కోఆపరేట్ చేసిన తారలందరికీ, టెక్నీషియన్లందరికీ నా మనఃపూర్వక కృతజ్ఞతలు" అన్నారు దర్శకుడు జి. సి. శేఖర్.

### ఎన్టీఆర్ ద్విపాత్రాభినయం

ఆదర్శ చిత్ర నిర్మించిన "మా ఇద్దరి కథ" వర్ణ చిత్రంలో ఎన్టీఆర్ అన్నగా ... తమ్ముడుగా ఒకర్నిమించి మరొకరుగా నటించారు. అన్న పాత్రకు కావలసిన సాత్వికం ... తమ్ముడు పాత్ర కోరిన జల్సాతనం ఎన్టీఆర్ వేషాలలో సిన్సియర్‌గా కనిపించాయి. భిన్న స్వభావాలు గొన్న అన్నదమ్ములుగా "నటరత్న" అద్వితీయంగా నటించారు.

మంచిని నమ్మిన అన్నయ్య ... వంచనకు వంచనే మందు అని ఆచరించిన తమ్మయ్య ... యీ రెండు పాత్రలలో ఎన్టీఆర్ బ్రహ్మాండం అనిపించారు.

శ్రీ రంజిత్‌కుమార్ ... గోపాలకృష్ణ నిర్మించిన యీ భారీ వర్ణ చిత్రంలో మంజుల, జయప్రద, రోజారమణి, సత్యనారాయణ, రావుగోపాలరావు, ప్రభాకరరెడ్డి, రాజబాబు ప్రధాన పాత్రధారులు.

శ్రీ నందమూరి రమేష్‌కు యీ చిత్రం బంగారుబాటను చూపిస్తుంది.

—శ్రీనివాస్

భాష నాకు రాదు. నాకు తోడుగా కూడా వుంటారు'' అన్నాను కొంచెం అభ్యర్థనగా.

అతను నవ్వి ''ఈ రాత్రికి వుంటానులెండి. కాని ఉదయం కటకం వెళ్లిపోవాలి. చాలా పనులున్నాయి'' అన్నాడు.

ఆ రాత్రి వెన్నెల్లో సుమారు రెండు మైళ్లు నడిచి సముద్రతీరానికి వెళ్లాం. నిరంజనం చాలా విషయాలు చెప్పాడు తన గురించి. తన కుటుంబ విషయాలని ఆత్మీయుడికి చెబుతున్నట్టుగా చెప్పాడు. నా వృత్తి గురించి ఎన్నో ప్రశ్నలడిగాడు వెన్నెల వెలుగులో సముద్రాన్ని చూస్తూ, చంద్రభాగ నది ఒడ్డున ఆహ్లాదకరమైన ఆ వాతావరణంలో ఒళ్లుమరచి నేను రెండు పాటలుకూడా పాడాను. చాలా మెచ్చుకున్నాడు నిరంజనం.

(అసలా సముద్రపు హోరులో అతనికి సరిగా వినిపించిందా? అని?)

సుమారు రాత్రి పన్నెండు గంటలకి సూర్య మందిరాన్ని చేరుకున్నాం. వెండివెన్నెల వెలుగుల్లో కోణార్క మందిరం యొక్క ప్రాచీనత, ఆ నిశ్శబ్దత కొట్టవచ్చినట్టు కనిపించాయి. నేను మరి మాటాడలేదు. మౌనంగా ఆ మందిరంచుట్టూ తిరిగాను. మళ్లీ కొత్తగా చూస్తున్నట్టు ప్రతి శిల్పాన్ని చూశాను. నిరంజనంకూడా నోరు విప్పకుండా నాతో తిరిగాడు. తరువాత నా గదికి వచ్చేశాం. అక్కడ మళ్లీ నిరంజనం సినిమాల గురించి, నటీనటుల గురించి అడగటం ప్రారంభించాడు. నిద్ర వస్తున్నా ఓపికపట్టి చాలా చెప్పాను. ఆ రాత్రి మరి నిద్రపోలేదు.

ఇంకా సూర్యోదయం కాకుండానే కెమేరాలు తీసుకుని సూర్య మందిరాని కెళ్లాం. సూర్యుడి తొలి కిరణాలు సూర్య మందిరంమీద పడుతున్నపుడు, ఆ వెలుగునీడల్ని దూరాన్నించి ఫోటోలు తీశాను. నిరంజనం కోసంకూడా నేనే తీశాను. రంగుల్లో తీసిన ఆ ఫోటో కాపీని తనకీకూడా ఒకటి పంపించమని కోరాడు. తప్పకుండా పంపిస్తానని అతని చిరునామా తీసుకున్నాను. కానీ అతని చిరునామా రాసుకున్న కాగితం అప్పుడే యెక్కడో పోయింది.

ఉదయం ఎనిమిదిగంటల బస్సులో అతను కటకం వెళ్లిపోయాడు. మళ్లీ కలవటం అనుకోకుండా యిప్పుడే. 'ఫోటోలు యెందుకు పంపించలేదని అడుగుతాడేమో అని కొంచెం భయపడ్డాను.

''ఏమిటంత దీర్ఘంగా ఆలోచిస్తున్నారు?'' అని అడిగాడు మూడో అంతస్తులో వున్న తన గది తాళంవేస్తూ.

''ఏంలేదు. ఆరోజు మనం కోణార్క్‌లో గడిపిన విషయాలు గుర్తొచ్చాయి.''

''కోణార్క్‌లో మీ సినిమా తీశారా?'' అన్నాడు గది లోపలికి ప్రవేశిస్తూ.

''లేదు. ఔట్‌డోర్‌కి అక్కడ చాలా చక్కటి ప్రదేశాలున్నాయి గానీ సదుపాయాలు లేవు ఖర్చుకి జడిసి మా నిర్మాత వెనకడుగు వేశారు. కోణార్క్ గనుక యీ తమిళదేశంలో వుండివుంటే కనీసం వంద సినిమాల్లో అయినా కనిపించివుండేది''

# కళాకారులిద్దరూ

(25వ పేజీ తరువాయి)

అన్నాను.

''పాపం! మీ ప్రొడ్యూసర్‌గారికి ప్రేక్షకుల్ని చకితుల్నిచేసి వాళ్ల జేబుల్లో పర్సుల్ని కొట్టేసే అవకాశం దొరకలేదన్నమాట. కానీ, ఆనందరావు గారూ! వాటిలో చాలావరకు శృంగార శిల్పాలు భువనేశ్వరంలోని త్రిభువనేశ్వరాలయంమీద, రాజారాణీ ఆలయంమీదా, లింగరాజాలయంమీదా వున్నాయి'' అన్నాడు నాకో పెద్ద సహాయం చేస్తున్నట్టు.

''ఉన్నాయి. నేను చూశాను: కానీ తీర్థప్రజ వుండేచోట సినిమా తియ్యలేం. అప్పైన ఆ ఆలయం ధర్మకర్తలు అసలు అంగీకరించరు. కోణార్క శిధిలావస్థలో వుందిగాబట్టి...'' అన్నాను అర్థోక్తిగా.

'అవునవును'' అని లోపలికి దారితీశాడు. అతని గదిని పరిశీలనగా చూశాను. అతని మంచంమీద ఫిడేలు, కమాను కనిపించాయి. అతనివైపు ఆశ్చర్యంగా చూస్తూ ''మీరు ఫిడేలు వాయిస్తారా?'' అని అడిగాను. అతను అంగీకారంగా నవ్వేశాడు, అదో చిన్న విషయం అన్నట్టు.

''అలా నాన్చేయకండి. మీరు వాయించాలి. నేను మీ అతిథిని అభ్యంతరంచెప్పే అధికారం మీకు లేదు.''

''అబ్బ! రోజంతా తిరిగి తిరిగి చీదరగా వుంది. స్నానంచేసి వస్తాను. మీరు కూర్చోండి ఆ కుర్చీమీద — పోనీ మీరుకూడా స్నానం చెయ్యరాదూ''

''లేదు — సాయంత్రం స్నానం నా ఆరోగ్యానికి పడదు. మీరు చేసిరండి'' అన్నాను కుర్చీలో కూర్చుంటూ. నిరంజనం స్నానానికి వెళ్లాడు.

ఆరోజు కోణార్క్‌లో తన గురించి కుటుంబ విషయాలుసైతం చెప్పాడుగానీ, తను ఫిడేలు వాయిస్తాడనీ, తనొక కళాకారుడనీ యెందుకు చెప్పలేదు? బహుశా నేను సినిమావాణ్ణి గనుక, యివన్నీ నా దృష్టిలో చిన్నవిగా అనుకుంటానేమో అని చెప్పకపోయివుంటాడు. ఫిడేలునీ, కమానునీ అందుకుని ఫిడేలుని గట్టిగా భుజానికి అణిచి కమానుతో తీగలమీద రాశాను. భయంకరమైన శబ్దాలు వెలువడ్డాయి. వెంటనే వుంచేశాను మంచంమీద. పక్కనే వున్న సినిమా పత్రికల్ని తిరగవేస్తూ కూర్చున్నాను. నిరంజనం స్నానం ముగించి వచ్చి, తెల్లటి లాల్చీ, షరాయి వేసుకున్నాడు. నా ఎదురుగా కూర్చుంటూ — ''ఇక చెప్పండి అతిథిదేవా! ఏం చేదాం'' అన్నాడు హాస్యంగా.

''మీ నైపుణ్యాన్ని ప్రదర్శించండి ఫిడేలుమీద'' అన్నాను గుర్తుచేస్తూ.

''ముందు భోజనం కానీండి. రూమ్ బోయ్‌కి చెప్పాను. మిఠాయి, భోజనం తెస్తాడు. మొహమాటపడకుండా తినాలి.'' అన్నాడు. నా కలవాటుంటే 'హాట్ డ్రింక్స్' తెప్పిస్తానన్నాడు.

''ఏం మీకు అలవాటులేదా?''

''లేదు. కానీ అప్పుడప్పుడు పరీ బలవంతం మీద తాగుతుంటాను. అసహ్యం నాకు.''

''నేనూ అంతే. కానీ అసహ్యంతోకాదు. కావలిసే దూరంగా వుంటున్నాను'' అన్నాను.

నాకొక కొత్తలుంగీ యిచ్చాడు కట్టుకోమని. భోజనం రాగానే సరదాగా మాట్లాడుకుంటూ ముగించాం. నాచేత చాలా తినిపించాడు. తరువాత మంచంమీద కూర్చుని ఫిడేలు, కమాను అందుకున్నాడు. శ్రుతి సరిచేశాడు. రెండు మూడు సార్లు కమానుతో తీగలపై లలితంగా రాసి స్వరాలు పలికించాడు. అలా చేస్తున్నంతసేపూ అతని మొహంలో అంతకుముందు లేని ఏకాగ్రతని గమనించాను. నా వైపు చూసి కళ్లెగిరేస్తూ ''ఇక చెప్పండి ఆనందరావుగారూ? ఏమిటి వాయించమంటారు? శాస్త్రీయ సంగీతమా? సినిమా పాటలా?'' అని అడిగాడు.

''మీ యిష్టం — ఏదయినాసరే''

''త్యాగరాజ కీర్తన. నను పాలింప నడచి వచ్చితివో — మోహన రాగం వాయిస్తాను'' అన్నాడు.

నేను సరేనన్నట్టుగా తలాడించాను.

''మీరు క్షమిస్తానంటే నాదో మనవి.''

''ఏమిటి?''

''సాధారణంగా సాంప్రదాయం ప్రకారం ముందు కొంత రాగాలాపన చేసి ఆ తరువాత శ్రుతి వాయించటం రివాజు. కానీ ఒక్కోసారి నేను దీనికి భిన్నంగా నా మనసు ఆనందంతో గంతులు వేస్తున్నపుడు నాకెంతో యిష్టం అయిన రీతిలో వాయిస్తుంటాను. ఈ మోహన రాగం నాకు చాలా యిష్టం''.

''నాకేం అర్థం కాలేదు'' అన్నాను అమాయకంగా.

''ముందు ఆలాపన వాయిస్తాను. అందులోంచే 'వరవీణా మృదుపాణీ' అన్న గీతంలోకి వెళ్లి, ఆ గీతంలోంచి ఆ రాగంమీదే వీణా కుప్పయ్యగారి ఆట తాళంలో చెప్పిన 'సరసిజాక్షి' అన్న వర్ణం వాయించి, ఆ వర్ణంలోంచి 'భవనుల్'లోకి వెళ్లి, చివర 'బడలికదీర కమల సంభవానుత' అని, అక్కణ్ణుంచి ఒక్క వూపున 'గపా, గరీ — సరిగా, రిస — సారీ సద — సారీరీ' అని పల్లవిలోకి దిగి, ఆ వెంటనే ఆ వూపుతోనే 'నను పాలింప నడచి వచ్చితివో' కృతి పూర్తిచేస్తాను. అలా చేస్తేనే నాకు తృప్తిగా వుంటుంది'' అన్నాడు నా అంగీకారం కోసం అన్నట్టుగా, చిన్న పిల్లాడిలా చూస్తూ.

''అలాగే. తప్పకుండా అలాగే వాయించండి. కాని యిదంతా నాకేదో కొత్తగా వుంది'' అన్నాను ఆసక్తిగా. అతను చిన్నగా నవ్వేసి తనకి తను సర్దుకుని వాయించటం మొదలుపెట్టాడు.

కొద్ది క్షణాల్లోనే తన లోకానికి — తన సంగీత ప్రపంచానికి నన్ను యీడ్చుకుపోయాడు. శాస్త్రీయ సంగీతంలో నాకంత ప్రవేశం లేదు. నన్నో ప్రజ్ఞావంతుడిగా గణించి వివరాలు చెప్పి ఏకాగ్రతతో వాయిస్తున్నాడు. రసాస్వాదనలో మునిగి పోయాను; అరచేతో తాళం వేస్తూ. చివరకి త్యాగరాజ కీర్తన 'నను పాలింప నడచి వచ్చితివో' అందుకున్నాడు. కళ్లు మూసుకుని అతని సంగీత సామ్రాజ్యంలో విహరించసాగాను. సాక్షాత్తు ఆ త్యాగరాజే నా కళ్లముందు ఆలాపిస్తున్నట్టనిపించింది.

(ఇంకా వుంది)

# బ్రిటానియా పాల బిస్కట్



## పెరిగే పాపాయిలకు రుచివంతమైన తోడు!




**రుచికరమైన, పుష్టికరమైన బ్రిటానియా గ్లాక్సో బిస్కట్లు**




బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

BBC.GLX.36-203

# కఠిన పరీక్షకు నిలిస్తేనే కార్యసిద్ధి

## ధర్మపథం

గొప్ప పరాక్రమశాలి అయిన ఒక రాజు ఉండేవాడు. అతనికి పారమార్థికాలవయి మనస్సు పోయింది. తనకు తగిన ఉపదేశం చేసి, ఆ మార్గాన్ని నడిపించే మహనీయుడు ఎక్కడా దొరకలేదు. అతడు దాన్నిగురించే ఆలోచిస్తూ ఉండగా కొన్నాళ్లకు ఒక మహనీయుడు అతని నగరానికి వచ్చాడు. ఆ మహనీయుని సంగతి రాజుకు తెలిసి, ఆయన వద్దకు పోయి రాజు తన కోరికను తెలిపి ఉపదేశం ఏదయినా చెయ్యమన్నాడు. ఆ యోగి క్షణకాలం ఆలోచించి "రాజా! నీవు కోరినట్లు నేను చేస్తాను. నాకు గురుదక్షిణ యేమిటి ఇస్తావు?" అని అడిగాడు. రాజు "మీరేమి కోరినా ఇస్తాను. నా సర్వస్వం మీదే" అన్నాడు. తర్వాత ఆ యోగి "అయితే నీ భార్యను, పుత్రికను నా పరిచర్యకు అప్పగించు" అన్నాడు

రాజు నిర్ఘాంతపోయాడు ఆ యోగి ఎక్కువ మొత్తాన్ని అడుగుతాడని అనుకున్నాడు. కాని,ఇలా అడుగుతాడని అనుకోలేదు. రాజకుటుంబాన్ని సేవకు అప్పగించడమా? అనే దురహంకారం కలిగింది. అయినా వాగ్దానం ప్రకారం జరపక తప్పదుకాబట్టి – దురభిమానాన్ని చంపుకుని దానికి సమ్మతించాడు. తర్వాత యోగి "రాజా! నీ భార్యాపుత్రికలు రాజభోగా లనుభవించేవారు. వారిని నేను పోషించలేను. వారి పోషణకు నాకు నీరాజ్యం కావాలి" అని అన్నాడు. ఇందేదో మోసం ఉందని అనుకొని రాజు మొదట ఒప్పుకోలేదు. కాని ముని కోపంతో చూడగా లొంగిపోయి తన సింహాసనం అప్పగించాడు యోగి దానిపై కూర్చుని రాజు భార్యను తన ప్రక్క కూర్చోమన్నాడు. రాజునకు విపరీతపుకోపం వచ్చి యోగిని నిందించాడు. యోగి "ఇప్పుడు నేను రాజును. నన్ను తిరస్కరిస్తే ఏ శిక్షనయినా అనుభవించాలి" అని సేవకుల్ని పిలిచి 'ఈ మాజీ రాజుకు పేడ పూసి, నాలుగు తన్నులు తన్ని తీసుకురావాలి' అని ఆజ్ఞాపించాడు. వారు విధిలేక అట్లే చేసి, రాజును తీసుకువచ్చారు. యోగి తన కాలి బొటనవ్రేలిని అతని శిరస్సుకు తాకించాడు. వెంటనే రాజులో విద్యుత్తు వ్యాపించి నట్లయి అపూర్వానుభవం కలిగింది. అహం పూర్తిగా నశించింది. తన అహంకారాన్ని పోగొట్టి పవిత్రుణ్ణి చెయ్యడానికే ఆ యోగి యీ విధంగా చేసినట్లు అతడు గ్రహించి ఆతని కాళ్లపై పడ్డాడు. ఇక తాను వెళ్లి పోదలచి ఆ ముని రాజ్యాన్నీ, రాజకుటుంబాన్నీ రాజుకు అప్పగించాడు, రాజు ఇష్టపడక పోయినా. తర్వాత "రాజా! అహంకారం విడిచిపెడితే, ఏ అంతరాయం లేవే ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందుతావు ఎవరూ ఏమీ ఉపదేశించనక్కర్లేదు. ఈ రాజ్యం భగవంతునిదే కాని నీది కాదనీ, నీవు ఆ పరాత్పరుని ప్రతినిధివి మాత్రమే అని గ్రహించి, న్యాయంగా–ధర్మంగా ప్రజలను పాలించు! అదే నేను చెప్పవలసినదీ, నీవు చేయవలసినదీన్నీ" అని ఉపదేశించి వెళ్లిపోయినాడు.

బులుసు వేంకట రమణయ్య

---

# తమసోమా జ్యోతిర్గమయ

(18వ పేజీ తరువాయి)

ఛ ఛ అనుకుందిగాని అనుమానం అక్కడే వుంది.

అతని మాటల ధోరణి...చూపుల తీరు—అన్నీ అనుమానాస్పదంగానే ఉన్నాయి.

'అదే నిజమైతే' అనుకుంది. అలా అనుకోగానే గుండె గుబగుబలాడింది.

అయినా అదెలా సాధ్యం?

శేఖర్ అరుణల ప్రేమగాథ అందరికీ తెలిసినదే! తదనుగుణంగా ఉంటున్నది,వాళ్ల ప్రవర్తన కూడా!

ఎక్కడా సందేహం లేనేలేదు

అయినా శేఖర్ తనపట్ల చూపుతున్న ప్రత్యేక శ్రద్ధకు కారణం ఏమిటి?'

ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ రజని వచ్చి భుజంమీద చేయి వేయడంతో ఉలిక్కిపడి తలెత్తి చూసింది సుజాత!

"ఏమిటే వరూధినిలా అలా కూర్చున్నావ్!" అంది రజని.

"ఏం తోచలేదు!"

"అందుకని ఇలా దిగాలుపడి కూర్చున్నా వన్నమాట. ఆడ పుట్టుక పుట్టి అబద్ధ మాడ్డం కూడా చాతకాలేదు నీకు. షేమ్... షేమ్..." రజని నవ్వింది.

"అబద్ధమా?"

"అక్షరాలా! అది పరేగాని ఏమిటేకథ. బంతులు నీమీద పడుతున్నాయి?"

"బంతులేమిటే?" సుజాత ఆశ్చర్యంగా అడిగింది.

"అదే... ఆ టెన్నిస్ ఛాంపియన్ గారు నీతో ఏదో మాట్లాడుతున్నాడుగా!"

'అంటే తనతో మాట్లాడ్డం రజని చూసిందన్న మాట' అనుకుంది సుజాత!

"ఓ అదా..." అంది తేలిగ్గా నిట్టూర్చి!

"అదే...ఏమంటాడు, గురూగారు?"

"ఏదో మాట్లాడాలిట..నాతో..."

"ఏమిటో అది...?"

"ఏమో! చెప్పలేదు వెళ్ళిపోయేటప్పుడు, బస్‌స్టాప్ దగ్గర ఓపదినిముషాలు ఆగితే చెప్తాడట!"

"ఓహో..." అని క్షణం ఆలోచించి... "ఆయితే కలుస్తావా?" అనిఅడిగింది రజని!

"అదే ఆలోచిస్తున్నాను. అయినా నాతో అతనికి మాటలేముంటాయని?" అంది.

సుజాత!

"ఏమైనా ఉండొచ్చు. ఎటొచ్చి, అరుణ నీమీదికి యుద్ధానికి వస్తుందేమో చూసుకో"

"ఛీ ఛీ అవేం మాటలే..." సుజాత ముఖం చిట్లించి అంది.

"ఏ మాటలైనా... ఎందుకైనా మంచిదని ముందే చెప్తున్నాను.."

"అలా అయితే అతనితో అసలు మాట్లాడను..."

రజని నవ్వింది ... "తొందరపడకు. అతగాడేం మాట్లాడబోతాడో తెలీదు. అనవసరంగా అనుమానించడం దేనికి? మాట్లాడినంతలో తప్పులేదు. అంతగా అతనేదైనా కూడని మాటలంటే అప్పుడే చూద్దాం..." అంది.

సుజాత అంగీకరించలేదు ... "అసలు అవకాశమే ఇవ్వకూడదు. వద్దులే..." అంది.

"సరే... నీ యిష్టం!"

కాన్వెంటులో పార్టీ మొదలయింది. ఏదో నాటిక అందించే నెపంతో, శేఖర్ సుజాతకు సీటైనంత దగ్గరగా మెసలడాన్ని రజని గమనించింది. రెండు మూడుసార్లు అరుణ అటుగా వచ్చిందిగాని, ఎక్కువసేపు వాళ్లతో ➤

కలిసి ఉండలేకపోయింది. 'మాధవరావుగారు తరచు అరుణను పిలిచి, ఎవరికో పరిచయం చేసేవారు.

పార్టీ అయిన తరువాత... ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. చివరకు మిగిలిపోయిన ఆడ పిల్లలుకూడా... అరుణతో చెప్పి బయల్దేరారు.

"మీ యింటివరకూ తోడు రమ్మంటావా!" సుజాతను అడిగింది రజని. సుజాత అంగీకరించింది.

ఇద్దరూ కలిసి బస్‌స్టాప్‌కు చేరేసరికి... శేఖర్ అక్కడే తచ్చాడుతూ కనిపించాడు.

సుజాత వెంట రజనిని చూసి ముందు తెల్లబోయినా అంతలోనే తేరుకుని "మీరింకా వెళ్ళిపోలేదా?" అని అడిగాడు రజనిని.

"మీరింకా ఇక్కడే వున్నారా? వెళిపోయారనుకున్నాం. ఎవరికోసమైనా ఎదురు చూస్తున్నారా?" అడిగింది రజని.

"ఔనండి... బస్సుకోసం..." అంటూ నవ్వాడతను.

"జోకు బాగుంది" అని నవ్వి "మీకు అభ్యంతరం లేకపోతే ఓ ఆటోను కేకేసి పెట్టండి. సుజాతను వాళ్ళింటి దగ్గర డ్రాప్ చేసి నేను యింటికి వెళ్ళిపోతాను" అంది రజని అతన్ని నిశితంగా గమనిస్తూ!

"ఆవిడనుకూడా తీసుకు వెళ్తున్నారా?" అన్నాడు శేఖర్!

ఎంత దాచాలని ప్రయత్నించినా అతని మాటలలోని నిస్పృహ స్పష్టంగా తొంగి చూసింది.

"ఔనండి. తనైతే వంటరిగానే వెళ్తానంది. కానీ నేనే బలవంతం చేశాను. ఒక్కర్తీ ఏం వెళ్తుంది" అంది రజని!

శేఖర్ క్షణం తటపటాయించి చివరకు తప్పనిసరి అయి, వెళ్ళి ఆటోను పిల్చుకు వచ్చాడు.

"మెనీ మెనీ థాంక్స్! వెళ్తొస్తాం ఇకనైనా బస్సు రాగానే వెళ్ళిపొండి. ఇంకా ఆగారంటే పాపం ఆలశ్యమౌతుంది. గుడ్‌నైట్" అంది సుజాత వెనుకనే ఆటో ఎక్కి రజని!

"పాపం దిగాలుపడి పోయాడె మానవుడు" జాలిపడింది శేఖర్ మీద ఆటో కొద్ది దూరం వెళ్ళిన తరువాత.

"పడితే పడ్డాడులే. నన్ను రక్షించావు" ంది సుజాత!

"నిజంగానేనా?" అని నవ్వి "అడుగుతున్నానని మరోలా అనుకోకు. నీకు శేఖర్ మీద ఏమీ లేదా?" అడిగింది రజని!

"ప్రస్తుతానికి గొంతు వరకూ కోపం ఉంది" సుజాత నవ్వింది.

ఎల్లమ్మతోట జంక్షన్ దగ్గర ఆటోని ఆపమనిచెప్పి తను దిగిపోయింది సుజాత!

"దగ్గరే కదా నడిచి పోతాను. ఈ కాస్త దూరానికి నువ్వెందుకు?" అంది.

"ఓకే! గుడ్‌నైట్" అంది రజని.

ఆటో వెళ్ళిపోయింది.

ఆటో వెళ్ళిపోయిన తరువాత, తలవంచుకొని రోడ్డుమీద రెండడుగులు వేసిందో లేదో...

కీచుమని చెవులదగ్గర పెద్ద చప్పుడు.

ఎవరో బలంగా చేయిపట్టి గట్టిగా లాగారు సుజాతను.

చేతిలోని పర్సొకవైపు తుళ్ళిపోయింది.

తను మరోవైపు.

అంతా గడబిడ చుట్టూ జనం.

రెండడుగుల దూరంలో సిటీ బస్సు, అందులోనుండి తొంగిచూస్తున్న మనుషులు.




సుజాత కంగారుగా లేచి నిలబడింది. ఎవరో దూరంగా తుళ్ళిపోయిన ఆమె పర్సు తెచ్చి అందించారు.

సిటీబస్ డ్రైవరు సీటులోనుండే తొంగి చూసి, ఏదో గొణుక్కుంటూ బస్సు కదిలించాడు.

"కంగారుపడకండి. మీ కేం కాలేదు" అన్నాడు పర్సు అందించిన వ్యక్తి.

అతనేమన్నాడో వినిపించలేదు సుజాతకు.

అసలు జరిగినదేమిటో అర్థంకాలేదు.

మెదడు మొద్దుబారిపోయినట్లయింది.

చుట్టూచేరిన జనం వాళ్ళలో వాళ్ళే మాట్లాడుకుంటూ ఎవరిదారినవారు చెదిరిపోయారు.

ఒక్కక్షణం మెల్లగా ఒక్కొక్కటే అర్థమయింది సుజాతకు. తప్పిపోయిన గండాన్ని తలచుకోగానే శరీరం చల్లబడినట్లయింది.

అందరూ వెళ్ళిపోయినా ఆ వ్యక్తి యింకా అక్కడేఉన్నాడు.

సుజాత అతనివైపుచూసి "చాలా కృతజ్ఞురాల్ని మీ..." అంటూఏదో చెప్పబోతే అతను వారించాడు.

"ఇందులో నాదేంలేదు. మీరు లేచిన వేళావిశేషం గొప్పది. అంతే!" అని సుజాత వైపు తేరిపారచూసి "బట్టలనిండా దుమ్ము చేరింది దులుపుకోండి" అన్నాడతను.

సుజాత తొందర, తొందరగా దుమ్ము దులుపుకుంది.

"రండి మీ యింటివద్ద డ్రాప్‌చేస్తాను" అన్నాడతను. కొద్దిదూరంలో పార్కుచేసిఉన్న స్కూటర్‌వైపు కదిలి.

"పరవాలేదండి. మాయిల్లు ఇక్కడికి చాలాదగ్గర. ఇప్పటికే మీకు చాలా శ్రమ అయింది. మీవల్ల బ్రతికి బయటపడ్డాను. నాకృతజ్ఞతలు ఎలాతెలుపుకోవాలో తెలియడంలేదు, నాకు.." అంది, సుజాత!

"కృతజ్ఞతల సంగతి అలా ఉంచండి. నా వెనుక స్కూటరు మీద కూర్చోవడం మీకు అభ్యంతరమైతే చెప్పండి.. రిక్షాను పిలుస్తాను అసలే షాక్‌తినిఉన్నారు, మీరు. మీరువద్దన్నా.. మీకు సాయంగా వచ్చితీర్తాను..." అన్నాడతను స్థిరంగా!

"అభ్యంతరమనికాదు. సరే మీ యిష్టం" అని వెళ్ళి స్కూటరు వెనుక సీటు మీద కూర్చుంది సుజాత!

ఇంటిముందు స్కూటరు ఆగడం.. ఎవరో అపరిచితవ్యక్తి వెనుక సుజాతను చూసి యింటిల్లిపాది.. కంగారు పడిపోయారు.

'ఏమిటే. ఏమైంది?' అందికామాక్షమ్మ. దుమ్ముకొట్టుకు పోయిన సుజాత బట్టలను చూడగానే, గాబరాగా!

"బట్టలనిండా ఆ దుమ్మేమిటి..అసలేమైంది..." అంటూ ఆత్రుత పడ్డాడు.. చలపతిరావు.

సుజాత.. జరిగిన సంగతి క్లుప్తంగా చెప్పింది. అందరూ గుండెల మీద చేయివేసుకున్నారు..

"మరి...నేనువెళ్తానండి..." అన్నాడతను గుమ్మం అవతలే నిలబడి.

అప్పుడుచూశాడు, చలపతిరావు అతన్ని..

"అరెరె. ఆత్రుతలో మిమ్మల్ని బయటే

## తపఃసోమా జ్యోతిర్గమయ

నిలబెట్టేశాం. రండి, లోపలికి..'' అంటూ ఆహ్వానించాడు.

"పరవాలేదండి. నేను వెళ్తాను ..." అన్నాడతను.

"అలా కాదు. లోపలికివచ్చి, ఒక్క క్షణం కూర్చొని వెళ్ళిపొండి. మా సంతృప్తి కోసం."

చలపతిరావు మళ్ళీ కోరడంతో అతను చిన్నగా నవ్వి లోనికి వచ్చి కూర్చున్నాడు.

"సమయానికి దేమునిలా వచ్చి మా అమ్మాయిని కాపాడారు. మీ మేలు ఈ జన్మలో మర్చిపోలేను" అన్నాడు చలపతిరావు.

అతను నవ్వేశాడు... "మీ అమ్మాయిని కాపాడినవాడు ఆ భగవంతుడే! ఆ పనికి నన్ను 'అతను' ఉపయోగించుకున్నాడు అంతే! ఇందులో నా గొప్పతనం అంటూ 'ఏమీలేదు' అన్నాడు!

చలపతిరావు అడిగిన మీదట అతను తన వివరాలను కుప్తంగా చెప్పాడు.

అతని పేరు విక్టర్! 'భారత్ హెవీ ప్లేట్స్'లో ఇంజనీరు. ముందు వెనుక ఎవరు లేరట. జగదాంబలో పిక్చర్ చూసి వస్తూ సిగరెటు కొనుక్కునేందుకు స్కూటరును రోడ్డు పక్కనే పార్కుచేసి వెళుతుంటే పరధ్యానంగా రోడ్డు దాటుతున్న సుజాత అటు వైపునుండి శరవేగంగా వస్తున్న సిటీబస్సు కనిపించాయట

"వెంటనే చేయిపట్టి లాగేశాను దట్సాల్" అన్నాడతను చాలా సాధారణంగా.

ఇంతలో మొహం కడుక్కొని డస్సు మార్చుకొని వచ్చింది సుజాత.

'దెబ్బలు తగల్లేదనుకుంటాను" అన్నాడు విక్టర్!

"మీ దయవలన దెబ్బలంటూ తగల్లేదు" అని చిన్నగా నవ్వి "చేయిమాత్రం నొప్పిగా ఉంది. మీరు బలంగా లాగారు ఒక్కసారి" అంది సుజాత!

"చంపారు. అయితే పొరపాటు నాదే" అన్నాడు విక్టర్ పల్చగా నవ్వి.

"ఆ నేరానికి చిన్న జరిమానా! ఇది తీసుకోండి" అంటూ హార్లిక్స్ గ్లాసు అందించాడు మురళి!

గ్లాసు అందుకొని వీలైనంత త్వరగా ఖాళీచేసి టైమ్ చూసుకున్నాడు విక్టర్!

పదకొండు దాటింది.

ఒక్క ఉదుటున లేచి నిలబడి "చాలా రాత్రయింది. ఇక నాకు శలవిప్పించండి" అన్నాడు.

అందరూ గుమ్మం వరకూ వెళ్ళి అతన్ని సాగనంపారు. విక్టర్ వెళ్ళిపోయిన తరువాత అతను ఖాళీచేసిన గ్లాసును సుజాత తీయబోతే కామాక్షమ్మ వారించింది "అలా ఉండనీ రేపు పని మనిషి తీస్తుందిలే. నువ్వు ముట్టుకోకు" అంది

సుజాత తెల్లబోయి చూసింది తల్లివైపు తరువాత ఇంకేం మాట్లాడకుండా గ్లాసు అందుకుంది.

"అదేం పని నీకే చెప్పేది" అంది కామాక్షమ్మ గట్టిగా.

ఈసారి కూడా సుజాత మాట్లాడలేదు, తిన్నగా వెళ్ళి గ్లాసు కడిగి వంటగదిలో పెట్టి. చేతులు తుడుచుకుంటూ వచ్చింది.

"నువ్వేం చెప్పదలచుకున్నావో... ఇప్పుడు చెప్పు" అంది తలి తోనే.

"ఇంకేం చెప్పేది. ఆచారం, సాంప్రదాయం రోజు రోజుకి మంటకలిసిపోతున్నాయి ఈ యింటిలో. నేను వద్దంటున్న కొద్దీ... నువ్వాపని చేయకపోతేనేం?" అంది కామాక్షమ్మ మండిపడుతూ!

చేస్తే నష్టమేమిటి?" సుజాత తిరిగి అడిగింది.

"చదవేస్తే ఉన్నమతి పోయిందని ప్రతి దానికి ఎదురు చెప్పడమొకటి బాగా అలవాటయింది!' అంది కామాక్షమ్మ రెచ్చిపోయి.

"ఇప్పుడేమయిందని ఆ రాద్ధాంతం..." అన్నాడు చలపతిరావు చిరాగ్గా!

"నిజమే నేనేమన్నా రాద్ధాంతమే వద్దు మొర్రో అంటే వినకుండా ఆడపిల్లను అందలమెక్కించారు. లక్షణమైన సంబంధాన్ని తిరగ్గొట్టేసింది ఆనాడు తర్వాత ... దీన్ని చేసుకుంటామని ఒక్కరైనా మన గుమ్మం తొక్కారా?" కామాక్షమ్మ గట్టిగా అంది.

దుఃఖభారంవలన మరి మాట్లాడలేకపోయింది. పైటచెంగు నోటికి అడ్డం పెట్టుకొని విసవిస లోనికి వెళ్ళిపోయింది.

ఈ హఠాత్పరిణామానికి సుజాత స్థాణువే అయింది.

భార్య వెళ్ళినవైపు క్షణంచూసి, భారంగా నిట్టూర్చాడు చలపతిరావు!

(ఇంకా వుంది)

# ఒక్క ఓడోమాస్ మాత్రమే ఖచ్చితంగా దోమలబారినుండి 2 విధాలుగా కాపాడుతుంది...

## మీరు రాత్రంతా హాయిగా నిద్రపోయేందుకు తోడ్పడుతుంది.

ఓడోమాస్ మరే యితర దోమల నివారిణి సమకూర్చని రీతిలో రక్షణ సమకూరుస్తుంది:



దీని వాసన దోమలను దూరంగా ఉంచుతుంది.



దీనిలోగల ప్రత్యేకమైన మూలపదార్థం దోమల బారి నుండి మీ చర్మాన్ని కవచంగా కాపాడుతుంది...రాత్రంతా.

ఇక, ఓడోమాస్ భారతదేశంలో అత్యధికంగా అమ్మబడుతున్న దోమల నివారిణి అంటే ఆశ్చర్యమేముంటుంది మరి!

దోమల బాధకు గురికాకండి—

# ఓడోమాస్

అందుబాటులో ఉంచుకోండి!



# ప్రశ్నావళి

## కె. రామలక్ష్మి

**కె వి ఆర్ — విజయవాడ**

ఏమండోయ్, మీకో సలహా యిస్తాను. ఏమీ అనుకోకండేం?

సలహా యివ్వడం వరకే మీ పని. అదినాకు పనికొస్తుందా లేదా తేల్చుకోడం నా పని. అంచేత ఏమీ అనుకుందుకు తావు లేదు!

**ఎమ్ ఎల్ — విశాఖపట్నం**

మనకు మనస్తాపం కల్గించే కొన్ని బాధ్యతలు విధికి వదిలి విశ్రాంతిగా వుండాలని ఒక స్నేహితురాలి సలహా?

విధి అంటే తలరాత అని కాబోలు మీ స్నేహితురాలి అర్థం. బాధ్యతలు కళ్ళుమూసేసుకుంటే ఒదిలి పోవు. చాపకింద నీరు లాగా కంటికి తెలియకుండా విస్తరించి ముంచేస్తాయి అందుకే బాధ్యతలని తప్పించుకు తిరగడం కంటే తీర్చేస్తూ పోడం— హాయి!

**వి. వి. ఆర్ — విజయవాడ**

మనిషి తత్వం గ్రహించడం సులభమా ?

అతగాడి కంటస్వరమే చెప్తుంది. అతగాని తత్వం!

**డి. జె. ఆర్ — హైదరాబాదు**

మీ గర్వానికి క్రెడిట్ ఏమిటి?

బ్యాంకు వారా ఏం క్రెడిట్ డబిట్‌ల అడుగుతున్నారు— నా క్రెడిట్‌కి వో ప్లస్సూ—వో వక్సెసూ వున్నాయి!

**టి. జి. వై — ఏలేశ్వరం**

ఈ కాలంలో మనిషి విలువ డబ్బునిబట్టి ఉంది కదండీ?

డబ్బుని పట్టి వుంది కాని డబ్బుని పట్టి వుండదు!

**బి. బిహెచ్. ఎస్ — భద్రాచలం**

మీరిచ్చే జవాబులు ఎప్పుడూ సంసార పక్షంగానే వుంటాయి కాని లోకజ్ఞానం పెంచేవిగా వుండవు..

ఎలా వుంటాయి? నేను సంసార పక్షం మనిషిని. వాదా వీడి వీడి జ్ఞానం—మీరన్నట్టు వ్యాసాల్లాంటి జవాబులిస్తే— మీరే అంటారు కాపీకేట్ అవి! అవునా??

**ఎస్. పి ఎస్ — నిజామాబాదు**

మనిషికెప్పుడు కల్గుతుంది ఆనందం?

ఎప్పుడూ పూర్తి ఆనందం కల్గదు.ఎందుకో తెలుసా? ఐశ్వర్యానికీ, పేదరికానికి మధ్య ఊగిసలాడుతూ వుంటుంది. మనిషి ఒకవైపే పరుగెట్టాలని తాపత్రయ పడతాడు!

**బి. ఎన్. ఎన్ — పెదపల్లి**

మనిషి మనిషిగా బ్రతకాలంటే ఏంచేయాలి ?

సాటి మనిషిని మనిషిగా చూడ్డం ప్రథమ కర్తవ్యం. మనిషి మీద సానుభూతి పెంచుకోవడం రెండో కర్తవ్యం.

**టి. ఏ — తిరుపతి**

కె. రా. గారూ ఒక వ్యక్తి యొక్క వ్యక్తిత్వాన్ని నిర్ణయించేది విద్యా, ధనమా?

రెండూ కాదు— ఆ వ్యక్తి తనని తాను— గౌరవించుకొనే విధానం!

మానవుడు జీవించేది ఆశతోనే గదా? మరి సర్వసంగ పరిత్యాగులు ఎందుకు జీవిస్తారు?

బహుశా ఈ లోకపు ఆశలపై విరక్తి కల్గి పరలోకపు రంభాదుల పరిష్వంగ సుఖాలను తలపోసుకుంటూ ఆ ఆశ మీద జీవిస్తారు కాబోలు.

**కె. కె — అమలాపురం**

మీ ఫోటో చూశాను. చాలా బోళాగా అమాయకంగా అనిపించారు. ఎందుకు అందరిచేతా అలా మాటలు పడతారు?

అందరి దృష్టిలోనూ నా తత్వం చాలా మొండిదని. నిజంగానే కాస్త మొండిదాన్నే! మొండి వాళ్ళే— కదా మనస్సు కుంచించుకు పోకుండా బతుక్కు రాగలరు! నాది వీపురం కాలిలో దాగిన వేగ పంజా అందొక స్నేహితురాలు. నిజమేనేమో!

### బెల్లం పాపిడి

కొలతలు :— ఒక కప్పు గోధుమపిండి. ¾ కప్పు తరిగిన బెల్లము, రెండు చెంచాలు గసగసాలు, పిండి బాగా తడిసేంతటి నెయ్యి లేక డాల్డా.

తయారుచేయు విధానము :- ముందు బాండి స్టౌవుమీద పెట్టి బాగా కాగిన తరువాత నెయ్యివేసి పిండిపోసి ఎఱుపువాగు వచ్చేదాకా వేయించాలి. తరువాత క్రిందకు దించి 2, 3 నిమిషములు వుంచి తరువాత తరిగిన బెల్లపుపొడి వేసి బాగా కలిపి నెయ్యిరాసిన పళ్ళెములోపోసి బాగా సర్ది దాచి పైన గసగసాలు చల్లవలెను వేడిమీదనే మనకు కావలసిన సైజులో ముక్కలు కొయ్యవలెను. చల్లారిన తరువాత ముక్కలు తియ్యవలెను.

— శ్రీమతి లక్ష్మీకృష్ణ

**సి. కె — హైదరాబాదు**

పట్టుదల పట్టి ఏదైనా విజయం సాధింప దల్చినవాణ్ణి. మీరేమంటారు?

ఆ పట్టుదల గుడ్డిదిగానూ, ఆ విజయం మన శ్రమకు తగినది కానిదానిగానూ వుండకూడదంటాను. ఏలేటి పాములో కూర్చుని దేశానికి రాజునవుతానని పట్టుపట్టి విజయం సాధించలేము! అవునా ?!

**వి. వి. ఆర్ — హైదరాబాదు**

యాంత్రిక యుగంలో చప్పుళ్ళు భరించరానివిగా వుంటాయి. సగం మందికి నరాల బలహీనతకి కారణం యివే నేమో?

ఏమో తెలియదు గాని, ప్రపంచంలో అన్ని రకాల చప్పుళ్ళల్లో— ఎదురు చూస్తున్న ఆత్మీయులు తలుపు తట్టడం లాంటి చప్పుడు యింకెక్కడా వుండదు అనిపిస్తుంది నాకు.

**డి. ఎస్. ఆర్ — విజయవాడ**

తీరి కూర్చొక మీ కెందుకండీ యీ రాతలు?

బోలెడు పని లేక పోతే యిలా తీరికూర్చోడం కూడా అసంభవం తమ్ముడూ ఆ మాత్రం తోచలేదా?

**డి. టి. — గద్వాల్**

రామాయణం విషవృక్షంపై మీ అభిప్రాయం ? ప్రశ్నావళిపట్ల మీరేం సాధించారు?

రామాయణ విషవృక్షం డబ్బు చేసుకుంది. ప్రశ్నావళి అంతే అనుకోండి సంపాదించింది ?

**వై. జె పిహెచ్ బి — కర్నూలు**

ప్రేమతో ఆడవాళ్లను ఆకట్టుకోడం సులభమా? ఆడవాళ్ల దగ్గిర స్నేహంగా వుండడం సులభమా ?

ఎదుటి స్త్రీని పట్టి వుంటుందయ్యా జగదీశ్ చంద్రబోస్ బాబూ, స్నేహం ప్రేమగా మారే అవకాశం వుంది. అప్పుడే ప్రేమలో కూడా స్నేహం నామమాత్రంగా నేనా మిగిలి వుంటుంది!

**ఎమ్. వి. ఆర్ — విజయవాడ**

మీ తెలివికి మీరు మహా ఆనంద పూరితులై పోతూంటారనుకుంటా ?

అంతే రావుగార్యూ, బుద్ధి హీనుని విజృంభణకు మించిన వినోదం వుండదు కదా !

ఏది కావాలన్నాకోరుకో అని అడిగితే ఏమీ అడగని వాళ్ళంటారా కె. రా గారూ ?

ఇప్పుడేమోగాని గ్రీకు చరిత్రలో డెమొజీనిస్ కథొకటి చెప్తూంటారు. వోసారి అతగాడు చలికి బాగుంటుందని ఎండలో కూర్చున్నాట్ట. ముసలివాడు పెద్ద మనిషి. వో రోజు అలగ్జాండరు అటు వెడుతూ గుర్రందిగి, డెమొజెనిస్ దగ్గిరగా వచ్చి అలగ్జాండరు నమస్కరిస్తున్నాడు. తమకి ఏం చేయ కలడని కోరుతున్నాడు అని సవినయంగా అడిగాట్ట. వాలిపోతున్న రెప్పలకి చేయి అడ్డం పెట్టుకుని అలగ్జాండరుని చూసి వో చిన్న నవ్వు నవ్వి నా ఎండకి అడ్డు లేస్తే అంతే చాలు ! అన్నాట్ట. డెమొజెనిస్ మహా పురుషులు అక్కడక్కడ వుంటూ వుంటారు

# అందమయిన మహిళలకు

# అందమయిన మిషను



ఆకర్షణీయమైనది.
నాజూకయినది. టూ-టోన్డ్.
ఉషా స్ట్రీమ్‌లైన్డ్—
అదే స్థాయి ధరలలోని
ఇతర కుట్టు మిషన్‌లను
అధిగమించే ఉత్తమ కుట్టు
మిషను. ఇతరులు
సాటిరాలేని లక్షణాలు.
5 ఏండ్ల గేరంటీ కూడా.



సులువుగా డార్నింగ్
చేసేందుకు, బట్టపై
ఒత్తిడిని త్వరితంగా
మార్చుకొనేందుకు
పేచ్ డార్నర్.




ఫీడ్-డాగ్ స్థానాన్ని
తేలిగ్గా
మార్చుకొనేందుకు
3 స్థానాలు గల
డ్రాప్ ఫీడ్.




డయల్-రకం స్టిచ్
రెగ్యులేటర్. దీనికి
ముందు కుట్టును, వెనుక
కుట్టును కంట్రోలు చేసే
స్టిచ్ కంట్రోలు, లాకింగ్
ఏర్పాటు ఉంటాయి.



తక్కువగా ఉండే
దారం పురి
సరిచేసుకునేందుకు
థ్రెడ్ టెంక్షన్
అడ్జెష్టర్.

**ఉషా స్ట్రీమ్‌లైన్డు** ప్రతీ అంశాన్ని బట్టి ఉత్తమ మిషను

# కస్తూరి

(9వ పేజీ తరువాయి)

ఇదివరకల్లా, ఉత్త డిగ్రీవాడేనా? చిన్న ఉద్యోగస్తుడేనా, అవి తీసిపారేశారు! ఇప్పుడేమో యింత పెద్ద సంబంధమా? అని నోరు వెళ్ళబెడతారేమిటీ?"

గయ్‌మంది సుభద్రమ్మ.

"నీ కూతురూ తక్కువదికాదు — ఆ సంబంధమూ తక్కువది కాదు — నేనేనే తక్కువవాణ్ణి! వేలకివేలు ఎక్కడ తెమ్మంటావ్?" అన్నాడు జానకిరామయ్యగారు నీరసంగా, భార్య మాటల్లోని సత్యాన్నీ, బాంక్ ఆఫీసరైన కూతురికి తగిన సంబంధం చూడలేకపోతున్న తన నిస్సహాయతనీ అంగీకరిస్తూ.

"ఇంతకీ, ఎంతటి కావాలిటన్నయ్యా వాళ్ళకి?" అడిగింది సుభద్రమ్మ.

"కట్నం విషయంలో పెద్ద పట్టింపులు లేవమ్మా వాళ్ళకి! వాళ్ళా మర్యాదగల కుటుంబీకులు! అబ్బాయి ఒక్కడే ముగ్గురాడపిల్లలమధ్య! అంతో యింతో ఆస్తి వుంది. అమ్మాయి బాగా చదువుకుని, ఉద్యోగస్థురాలై వుండటమే వాళ్ళకి కావల్సింది!

పైగా... అబ్బాయి మన కస్తూరిని బాంక్‌లో చూశాడుట కూడా!"

"అబ్బాయి... చూశాడా? అయితే అతను కస్తూరిని ఎరుగునా?"

"ఏదో కొద్ది పరిచయమే తప్ప, చెప్పుకోదగ్గంతగా తెలీదుటగానీ-అతనికి అమ్మాయి నచ్చుబట్టే, వాళ్ళు నన్ను కదిలించారనుకో! అయితే, యివన్నీ నీకు చెప్పమన్నాడు. చులకన చేస్తావని భయమో, ఏమో! కానీ, నేనే వుండబట్టలేక చెప్పేశాను."

"ఏంతమాట! అదృష్టంకొద్దీ వాళ్ళు వస్తే మాత్రం, చులకన చేస్తానా? అంత మర్యాదలేని వాడినా?... అయితే ఎప్పుడు వెళ్ళి మాట్లాడదాం?"

"నీ యిష్టం. వాళ్ళు వుండేదీ యీ వూళ్ళోనే!"

"ఇంకా ఆలస్యం దేనికి మరి? రేపు వెళ్దామా?"

"అలాగే! రేపుదయంవెళ్ళి మాట్లాడదాం. వాళ్ళఅక్కగారు వచ్చారని రెండురోజులుశలవు పెట్టాడు.వీలయితే రేపు పెళ్ళిచూపులుకూడా ఏర్పాటు చేద్దాం— వాళ్ళక్కగారూ కూడా పిల్లని చూడాలంటోంది."

"నువ్వు మరీయింత [illegible]కంగా మాట్లాడుతుంటే, నాకు ఉక్కిరి[illegible]గా వుంది బావా!" సంతోషంగా అన్నాడు జానకిరామయ్యగారు.

"అంతేనయ్యా!కలిసొచ్చేరోజున నడిచొచ్చే కొడుకుమరీ!" నవ్వాడు. జగన్నాధం.

సుభద్రమ్మ టిఫిన్ చేయటానికి లోపలికి వెళ్ళింది. జగన్నాధం, జానకిరామయ్యా తమ అభిమాన పాత్రమైన చదరంగంలో పడ్డారు.

* * *

ఆరాత్రి అందరూ భోజనాలు చేస్తుండగా సంబరంగా సంబధం విషయం కదిపింది సుభద్రమ్మ'

"అమ్మాయ్! నువ్వు కాస్త శలవు పడెయ్యాలమ్మా రేపు" అటూ.

"దేనికి? నీకేదైనా బజారు పనా?"

"నాక్కాదమ్మా! నీకే!" అందావిడ నవ్వుతూ.

"నాకా?"

"అవును! రేపు నిన్ను చూడటానికి వస్తున్నారమ్మా!" మురిపెంగా అందావిడ.

కస్తూరి ఏమీ అనలేక, తలదించి ముద్ద నోట్లో పెట్టుకుంది.

"అతను పోస్టుగ్రాడ్యుయేట్! అయ్యేయస్ పాసై, ఏజి ఆఫీసులో క్లాస్‌వన్ ఆఫీసర్‌గా ఉద్యోగం చేస్తున్నాట్ట!" హుషారుగా అన్నాడు జానకిరామయ్యగారు.

"అబ్బా! కంగ్రాచ్యులేషన్స్ చెల్లాయ్" అన్నాడు శేఖర్ నవ్వుతూ.

"వాళ్ళకి కట్నంమీదా అట్టే ఆశలేదుట..."

"... ... ... ..."

"అన్నట్టు అతను నిన్నింతకు ముందే బాంక్‌లో చూశాడుట కూడానూ!" అంది ఉన్నట్టుండి సుభద్రమ్మ.

ఆ మాటకి వులిక్కిపడింది కస్తూరి.

"నన్ను చూశాడా? ఎవరై వుంటాడు?" వెంటనే గుర్తుకి వచ్చాడు సుందర్.

'ఆఁ! సుందరే అయ్యుంటాడు. అదృష్టవంతురాలివే! డబ్బు, అందం, చదువు—అన్నిటికీ తగ్గ వాఁడా!...'

కస్తూరిని ఊరించి, ప్రోత్సహించింది మనసు.

# వారఫలం

**— మహేష్**

**8-7-1977 శుక్రవారం మొదలు 14-7-1977 గురువారం వరకు**

**మేషం :—** వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**వృషభం:—** ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతనవ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మిధునం:—** మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది. వారం ఆఖరులో వ్యతిరేకమైన వార్తలను వింటారు. లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కర్కాటకం :—** అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగుంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. దైవ కార్యాలు నెరవేరతాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మీ ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**సింహం :—** అనుకూలమైన వార్తలను వింటారు. రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కన్య :—** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. ఆందోళనకు గురి కాగలరు. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభించగలవు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. సంతోషకరమైన సమాచారం అందుతుంది.

**తుల :—** రావలసిన డబ్బు అందుతుంది. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం ఆఖరులో చికాకులు యేర్పడతాయి. సాహసిక వ్యవహారాల్లో నష్టం వస్తుంది. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధువులకు చికాకులు కలుగుతాయి.

**వృశ్చికం :—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదాపడతాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. పుణ్య కార్యాలు చేస్తారు.

**ధనుస్సు :—** వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. మీ కార్యక్రమాలకు మార్పులు వస్తాయి. వృత్తిలో అనుకూలత లభిస్తుంది. స్త్రీలకు— ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మకరం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా వుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం :—** అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. మిత్రులకు సహాయం చేస్తారు. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. స్త్రీలకు— సంతోషకరమైన వార్తలను వింటారు. పుణ్యకార్యాలు చేస్తారు.

**మీనం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. వృత్తిలో పోటీదారి పోటీ తగ్గుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

---

నిర్లిప్తంగా వుండిపోయింది కస్తూరి మాత్రం.

"ఈ పెళ్లి చూపులు కూడా లాంఛన ప్రాయమేనుట! ఆ తంతు కాస్తా కానిచ్చి, అవుననుకుంటే చాలుట!

ఏంతయినా మన కస్తూరిది అదృష్ట జాతకమండీ - మొదట్నుంచీ కూడా!"

భర్తకి పెరుగు వడ్డిస్తూ అంది ఆవిడ.

"అమ్మాయి కన్నా మనం అదృష్టవంతులం" అన్నాడాయన, తన్మయత్వంగా. మధ్యాహ్నం నించీ ఆయన మనసు ఆకాశవిహారం చేస్తోంది.

"రేపుదయం నేను వెళ్లి వాళ్లతో మాట్లాడి వస్తాను. రేపు శలవు పెట్టడం నీకు వీలవుతుంది కదమ్మా?" అడిగారాయన కూతుర్ని ప్రేమగా చూస్తూ.

ఆలోచనల్లో అప్పటిదాకా సతమతమయిన కస్తూరి, ఇక తప్పదన్నట్టు నోరు మెదిపింది.

"క్షమించండి నాన్నా! నాకీ సంబంధం యిష్టంలేదు"

ఉలిక్కిపడ్డారు అందరూ — కలలోకూడా వూహించని యీ జవాబుకి.

"అదేమిటమ్మా? ఏందుకు యిష్టంలేద అతన్నీకు ఇదివరకే తెలుసా?"

"ఎక్కువ పరిచయంలేదు."

"ఏం? మంచివాడు కాదా?"

"అతని గురించి నాకెక్కువ తెలియదు."

"మరి ఎందుకు నీకు అభ్యంతరం?"

"... ... ... ..."

జవాబు చెప్పకుండా, చెయ్యి కడుక్కుంది కస్తూరి, ఇహ చెప్పగలిగిందేమీ లేనట్టుగా.

"అయినా మీ పిచ్చికాకపోతే, ఉద్యోగస్థురాలైన దానికి మీరు సంబంధం చూడటం ఏమిటి నాన్నా — అది యీపాటికే ఎవరినో నిర్ణయించేసుకుని వుంటుంది." వ్యంగ్యంగా అన్నాడు శేఖర్. అతనికి చెల్లెలి అభిప్రాయం నచ్చలేదు. పైగా, కారణం చెప్పని ఆ మౌనం కోపం తెప్పించింది.

ఆ మాటల్తో, పీటమీంచి లేచి, వెళ్ళబోతున్న కస్తూరి చటుక్కున వెనక్కి తిరిగింది.

"చిన్నప్పటినించీ కలిసి, మెలిసి స్నేహితుల్లా వుంటున్నా — నా మనసు అర్థం చేసుకోలేకపోయావన్నయ్యా — నువ్వనుకున్నట్టు నేనిదివరకే ఎవర్నయినా ప్రేమించి వుంటే, ఆ మాట నీతోనైనా తప్పకుండా చెప్పివుండేదాన్నే! అలాంటి కారణాలు కావు. కానీ, నాకీ సంబంధం యిష్టంలేదంతే!" ఖచ్చితంగా అనేసి, గబ గబ తన గదిలోకి వెళ్ళిపోయింది.

[వచ్చేవారం రెండోభాగం. రచన: తులసి బాలకృష్ణ]

# షెల్కొణని డైరి

## అపూర్వమైన ఆటోగ్రాఫ్

బ్రిటిష్‌రాణి ఎలిజబెత్ యింతవరకూ ఎవ్వరికీ ఆటోగ్రాఫ్ యివ్వలేదట. అసలు ఎవరికీ ఏ కాగితం మీదా ఏ పుస్తకంలోనూ తనుట్టి సంతకం పెట్టనే లేదట.

## ప్రేమకు అడ్డొస్తే!

ఢిల్లీ నగరంలో ముకేష్ అనే వో అబ్బాయి 15 ఏళ్ళ సరిత అనే అమ్మాయిని ప్రేమించి, ప్రేమించ చేసుకున్నాడట. ఇది సరిత తల్లికి బొత్తిగా నచ్చక ముకేష్‌ని గదమాయించిందట. దాంతో అతనికి కోపం వచ్చి తన ప్రియురాలి తల్లిని కత్తితో పొడిచి చంపి ఆ కార్యానికడ్డొచ్చిన సరితను కూడా పొడిచాడట. సరిత ప్రమాదం తప్పిందట! బట్! అతన్నింకా ప్రేమించగలదా! తెలియదు.

### రెండు ఊళ్ళల్లో మశూచి

సోమాలియా అనే దేశంలో రెండంటే రెండు ఊళ్ళు తప్ప తతిమ్మా యావత్ ప్రపంచంలోను మసూచిని వైద్య శాస్త్రం అణిచివేయగలిగిందట

## అమెరికాలో అదృష్టవంతుడు!

అమెరికాలో జెప్స్‌హోమర్ అనే వో అదృష్టవంతుడు రోడ్డు దాటుతూ రోడ్డు ప్రమాదానికి గురైతే, తత్ఫలితంగా ఆయన తల పుటుక్కున రెండంటే రెండు ముక్కలయ్యిందట. ఆసుపత్రిలో డాక్టర్లు చకచకా ఆ రెండు ముక్కలను ... చికిత్స చేసేశారట. జెప్స్‌హోమర్ ఎంచక్కా వున్నాడట.

### పెళ్ళి కాదనే నిస్పృహతో అమ్మాయి ఆత్మహత్య

తమిళనాడ గోపిని అనే ఊరుకు చెందిన షణ్ముగం అనే అతని కూతురు కోకిల వాణి అనే అమ్మాయికి ఏ పెళ్ళి సంబంధమూ ఎంత ప్రయత్నించినా రాలేదట. ఆమె చెల్లెలికి యిట్టే పెళ్ళయి అట్టే అత్తవారింటికి చక్కా వెళ్ళి పోయిందట. తనకిక కళ్యాణయోగం లేనే లేదని తన బ్రతుకు వ్యర్థమనీ శల్పుకు తల్పుకు ఏడ్చిందట. ఎన్నాళ్ళిలా ఏడ్చినా ఏమీ ప్రయోజనం లేదని నిర్ణయించుకుని ఆమె నల్లుల మందు త్రాగి, నిండు ప్రాణాలు తీసుకుందట.

### భయంతో ఆత్మహత్య చేసుకున్న సైకిల్ దొంగ

ధారామంగళం అనే ఊరిలో వైత్తి అనే వో కుర్రాడు శక్తి వంచన లేకుండా కొన్ని సైకిళ్ళను దొంగతనం చేశాడట. కానీ యీ విషయంలో పోలీసులు జోరపడి తనను పట్టుకోవాలని ప్రయత్నించేసరికి భయపడి జిల్లేడాకులు, మరేదో కలిపి తిని ఆత్మహత్య చేసుకున్నాడట.

### ఆస్పత్రిలో ఏడ్పుల గది!

ఆసుపత్రిలో రోగులు చనిపోతే వారికి సంబంధించిన వారు అక్కడే, అక్కడికక్కడే, అప్పటికప్పుడే ఏడుపులు పెద్ద పెట్టున ప్రారంభించి, కొనసాగించడం వల్ల ఆసుపత్రుల్లోని వాతావరణం పాడవడమేగాక బ్రతికున్న యీ రోగుల నిబ్బరం సడలే ప్రమాదముందని, కనుక యీ రకం ఏడ్పులకు ప్రత్యేక వసతులు కల్పించాలని నిర్ణయించి బెంగుళూరు ఆసుపత్రులలో కొన్ని, తలో రూము కేటాయించటానికి, చనిపోయిన రోగులకు సంబంధించిన వారు యకాయకి ఆ రూముకు వెళ్ళి నిర్ణీత కాలం దుఃఖించి వచ్చెయ్యాలట. ఏక కాలంలో ఒకటికన్నా ఎక్కువైతే అలాంటి కేసులు? ఆ రూముల్లో బృందగానం అవ్వదూ! అలాఅయితే బావుండదేమో! మరెలా! వీపింగ్ బై ప్రయారిటీ అండ్ విత్తిన్ టైమ్ ఎలాటెడ్! మంచిపద్ధతి.

### తుపాకి లైసెన్సులు

ఇటలీలో యిప్పుడు పౌరునికి తుపాకీ లైసెన్సులు విరివిగా యిచ్చేస్తున్నారట. పోయినేడు యిరవై అయిదు లక్షల తుపాకులకు లైసెన్సులిచ్చిందటా ప్రభుత్వం.

### విమాన ప్రమాదాల నివారణ

తూర్పు జర్మనీ దేశం మీదున్న ఆకాశ భాగం మన ఆంధ్రప్రదేశ్ మీదున్న ఆకాశ భాగంతో సమానమట. అసలా విస్తీర్ణంలో పోలికన్న మాట అక్కడ— ఆ ఆకాశ భాగంలో రోజుకు పదకొండు వేల విమానాలు ఎగురుతూ వుంటాయట. 1976లో 221 విమాన ప్రమాదాలు జరిగుండాల్సినవి కూడా జరగకుండా నివారింపబడ్డాయట ఏహ్హా సజ్జక్కీజా ఇన్‌క్రెడిబుల్!

## ఎమర్జెన్సీలో నిషేధించిన పుస్తకం !

గుజరాత్‌లోని సెకండరీ స్కూళ్లలో మహాత్మా గాంధి స్వీయ చరిత్ర సత్యప్రయోగ్ అనే పుస్తకాన్ని భారత పాత(!) ప్రభుత్వం ఎమర్జెన్సీ కాలంలో నిషేధించిందట — అన్యుల చేతుల్లో నుంచి మన దేశాన్ని మనం లాక్కున్నాక దేశంలో మన ప్రభుత్వం నెలకొన్నాక గాంధి మహాత్ముడు జవహర్లాల్ నెహ్రూని మొట్టమొదటి భారత ప్రధానిగా ఎన్నిక చేయడం నియమించడం గాంధీ గారు చేసిన పెద్ద తప్పు అవటాని ప్రస్తుత ప్రభుత్వంలోని పో ముఖ్యుడన్నారట—నో కామెంట్.

ఉద్యోగాలు పోగొట్టిన పాలడబ్బా, పొగ

విశాఖపట్టణ ప్రాంతానికి చెందిన హో పోలీసు కాన్‌స్టేబుల్ తన అధికారి గారి అబ్బాయిగారికో పాల డబ్బా సంపాదించలేని కారణంగా తన నిక్షేపం లాటి వుద్యోగం పోగొట్టుకున్నాడట. తన పై అధికారి రాడం గమనించక, ఎంచక్కా

పొగత్రాగుతూ కూర్చున్న ఆ పోలీసు అధికారి టక్కున తాననుకున్నకన్నా ముందే రిటైరై పోయాడట. ఈ రెండూ ఎమర్జెన్సీ కాలంలో జరిగినవేనట.

### తమిళనాడులో రాష్ట్రపతి పాలనపై దేశాయ్ విమర్శ

జనతా ఎన్నికల ప్రచారార్థం తమిళనాడు వచ్చిన ప్రధాని దేశాయ్ ద్రవిడ మున్నేట్ర కజగం ప్రభుత్వాన్ని పాత కేంద్ర ప్రభుత్వం డిస్మిస్ చేయడాన్ని మంచి పద్ధతి కాదని విమర్శించారట. పుదుక్కోటలో ఆయన మాట్లాడుతూ డి. ఎం. కె. ప్రభుత్వాన్ని తొలగించి రాష్ట్రపతి పాలన పెట్టిన పాత కేంద్ర ప్రభుత్వం చేసిన పని తప్పన్నారటాయన.

### జర్మనీలో కార్ల దొంగతనం

పోయినేడు జర్మనీలో అరవై అయిదు వేల కార్లు తస్కరింపబడ్డాయట. ఈ కార్లలో చాలా భాగం మెర్సిడిస్ కంపెనీవట. అక్కడ కార్ల దొంగతనం చాలా సునాయాసంగా జరుగుతూ ఉంటుందట. ●



# డాక్టర్ సలహాలు

కె. ఎస్. ఎల్ - నెల్లూరు

నా వయస్సు 17 సం. లు. 2 సం. ల నుండి నా మొఖంమీద గోధుమరంగు మచ్చలు వస్తున్నాయి. అవి ఎందుకు వస్తాయి? అవి పోవాలంటే ఏమీ చెయ్యాలి?

మచ్చలనేవి ఏ రంగులో ఉన్నా అవి ఎలా ఏర్పడతాయనేదే ముఖ్యంగా పరిశీలించతగిన విషయం. తెల్లగా మచ్చలేర్పడటం, నల్లటి మచ్చలు మీరు వ్రాసిన గోధుమ రంగు లేక జేగురు వర్ణపు మచ్చలనేవి ఎక్కువగా శిశు ప్రాయంలోనే తల్లి గర్భంలో పెరుగుతున్నప్పుడే నిర్ణయింపబడి ఏ సమయంలోనైనా బహిర్గతమయ్యే అవకాశం కలిగి ఉంటాయి. కొన్ని మచ్చలు ఒకే ప్రదేశంలో మాత్రంలోనే ప్రత్యేక కారణాల వల్ల ఏర్పడివుంటే మాత్రం కృత్రిమంగా రాగలవని అంటారు. ఉదాహరణకు, జేగురు వర్ణపు లేక గోధుమ వర్ణపు మచ్చలు ముఖం మీద, మొటిమలు గిల్లబడిన తర్వాత ఆ చుట్టూతా చేరే నెత్తురు గడ్డ కట్టి నిలిచిపోవటం వల్ల ఏర్పడటం జరగటం సహజమే! అవి పోవాలంటే ప్రత్యేకంగా తీసుకోదగిన చర్యలేమీ లేవు. పైగా నలుగురూ చెప్పే నాలుగు మాటలూ విని అసలుకే మోసపోయేకన్నా ఉన్నదాన్ని అలాగే ఉంచటం మంచిది.

వి. వి - తాడేపల్లి గూడెం

సుఖవ్యాధి లక్షణాలు ఏమిటి? ప్రారంభ దశలో వున్న సుఖవ్యాధికి నివారణోపాయం తెలుప ప్రార్థన.

సుఖవ్యాధి అనేది ఒక్కటే ఒక్క రోగంకాదు— అనేకరకాల రోగాలకి కలిసి వాడబడే పదం. అన్నిటిలోనూ— జననేంద్రియాలలో ప్రారంభంలోనూ, రోగం ముదిరితే శరీరంలోని ఇతర భాగాలలోనూ, రోగాన్ని బట్టి రోగ లక్షణాలు ఏర్పడతాయి.

ప్రారంభ దశలో ఉన్న సుఖరోగాన్ని ముఖ్యంగా వైద్యులచే రోగ నిర్ణయం జరిగినతర్వాత ఏ అవాంతరాలు లేకుండానే నయం చేసుకోవచ్చు పెన్సిలిన్, పి. ఎ. ఎం., సల్ఫాడయాజీన్, టెట్రామైసిన్, స్ట్రెప్టోమైసిన్ మొదలైనవి రోగానికి తగినట్లుగా, తగినంత కాలం వైద్యులసలహా ప్రకారం విధిగా సిగ్గుపడకుండా వాడితే నయమైపోతుంది [పోతాయి]!

పి. ఆర్ — చంద్రాపూర్

నాకు 5, 6 నెలలుగా మలద్వారము వద్ద పురుగు తొలుచుచునట్లుగా గులగుల మంటూ వుంటుంది. 4, 5 సార్లు మలద్వారానికి అంటుకొని ఒక చిన్న పురుగు కన్పించింది. అది తెల్లగా 4, 5 మి.మీ. పొడవు వున్నది. అలాగే ఒక్కొసారి కాలివుడమ వద్ద, వేళ్ళలోనూ, అరచేతిలోనూకూడా ఏదో ప్రాకుతున్నట్లు దురద పుట్టేది. మలద్వారం వద్ద వచ్చిన పురుగుకి వీటికి ఏమైనా సంబంధమున్నదా?

తప్పక సంబంధం ఉన్నది. ఈ "పురుగుల"ని (క్రిములు) (థ్రెడ్ వర్మ్స్ లేక పిన్ వర్మ్స్) ఆక్సీయూరిస్ వర్మికులారిస్ అనే వైద్య పరిభాషలో వ్యవహరిస్తారు.

ఈ పురుగుల గుడ్లు— కాలి వుడమలద్వారాగాని, గోళ్ళలోని మట్టిలోని గుడ్లు కడుపులోకి నేరుగా ప్రవేశించటం ద్వారా ఈ గుడ్లు (లార్వా దశలలో) పెరిగి మీరు వర్ణించిన రీతిగా పెద్ద పురుగుగా మారుతుంది. ఈ లార్వాలు చర్మంలో ప్రవేశించిన సమయంలో ఏదో ప్రాకినట్లనిపించటం జరుగుతుంది. ఈ ప్రాకే అనుభవానికీ, మలద్వారం వద్ద వచ్చిన నులి పురుగులకి పైపై విషయాల దృష్ట్యా సంబంధం ఉన్నదని వేరే చెప్పనక్కర లేదుగా!

—డా కె. వెంకటేశ్వరరావు

# చంద్రమండలం మీద గోధుమపంట!

**చం**ద్రునిమీద వాతావరణం శూన్యం కావడం చేత ఆరుబయలులో అక్కడ మొక్కలు బతకవు – అని సోవియట్ జీవశాస్త్రవేత్త డా. గ్రనిఖ్ లిసోన్‌స్కీ. కృత్రిమ వాతావరణం సృష్టించి పంటపొలాన్ని మూసిపెట్టినట్లయితే నాలుగు చంద్ర దినాలలో గోధుమ మొలకెత్తి, పెరిగి, పండేస్తుంది. పంట తగ్గుదల మన భూమిమీద పరిస్థితులతో పోల్చి చూస్తే నామ మాత్రం.

చంద్రునిమీద 'గ్రీన్ హౌస్'లు ఏర్పాటు చెయ్యాలి. కాని వెలుతురు ఒక సమస్య అవుతుంది. భూమిమీద మొక్కలు రాత్రీ, పగలు మార్పులకు అలవాటుపడ్డాయి. కాని చంద్రునిమీద ఒకరోజు మన నెలకు ఇంచు మించు సమానం. 15 రోజులకు సరిపడా పగలు, మరో 15 రోజులు రాత్రి వుంటుంది.

రాత్రిపూట కృత్రిమమైన వెలుతురు నుపయోగించవచ్చు. కాని దానిని సృష్టించడం ఎల్లాగ? కావలసిన వెలుతురుకొంచెమేం కాదు. పైగా వెలుతురు సృష్టించడంలో కలిగిన వేడిని తొలగించడానికి ఎంతో ఉధృతమైన పరికరాలు కావాలి. భూమిమీద పెరిగే గోధుమ మొక్కలు చంద్రమండలంలోని పరిస్థితులకు అలవడి జీవించేటట్లు చేయడం ఎల్లాగ?

సూర్యుని కాంతిని పోలిన వెలుతురు సృష్టించి మన 15 రోజులపాటు నిరంతరాయంగా ఆ వెలుతురులో గోధుమనూ, కొన్ని కూరగాయలనూ పెంచేరు. తరవాత మరో 15 రోజులపాటు చీకటిలో వుంచారు. గదిలో వుండేపాటి వేడిని నిలవబెట్టినప్పుడు మొక్కల పసిరకపోయి, ఆకులు రంగుమారి, ఎండిపోయాయి. దీర్ఘకాలం మీద చచ్చిపోయాయి. కానీ, చంద్ర రాత్రిని కృత్రిమంగా సృష్టించినప్పుడు, ఉష్ణాన్ని తగ్గించడం కూడా జరిగినప్పుడు, రసాయనిక పోషక పదార్థాలు, ముఖ్యంగా నత్రిత పోషణ లేకుండా చేసే, ఆవిరి అయిపోయిన నీటిని సరఫరా చేసేందుకు కేవలం నీరు అందజేస్తూ వుంటే మొక్కలు కృత్రిమంగా కల్పించిన చంద్ర రాత్రిని గడపగలిగేయి.

ఒక విధమైన శక్తి నిలుపుదల ప్రారంభమయింది. గోధుమను చీకట్లో, 3-4 సెంటిగ్రేడ్ డిగ్రీల ఉష్ణోగ్రతలో పెట్టి, పోషణకోసం వట్టి నీరు మాత్రమే పెడుతూంటే ఒక చంద్రనిశి అనంతరం గోధుమ పెరగసాగింది. మరనటి 15 రోజులు చంద్రగోళ దినా భాగంలో గోధుమ వెన్ను వేసింది. తరువాత 15 రోజులూ చీకటి. ఆ మాదిరి దివారాత్రి క్రమంలో మొక్కలు మామూలుగా పెరిగి, వెన్నువేసి, గోధుమ పండింది. ఆ మొక్కలనుంచి వచ్చిన రెండవ, మూడవ తరం పంటనుకూడా పరీక్షించి చంద్రగోళ దివారాత్ర క్రమంలో పెట్టి వానిని పరీక్షిస్తున్నారు. ధాన్యం బాగా పండబారక పోవడంచేత కొద్దిపాటి మార్పులొచ్చాయి. కాని మొత్తంమీద మొక్కలు మామూలుగానే పెరిగేయి. కారట్‌లు, బీట్, టర్నిప్‌లతోకూడ యీ విధంగా పరిశోధనలు జరిపారు. ఇవికూడా బాగానే పెరిగాయి. మామూలు జీవరసాయన సమ్మిశ్రణగల దుంపలు పడేయి. ఫలితంగా చంద్రునిమీద సూర్యరశ్మిని వుపయోగించవచ్చు. మనుష్యుడు చంద్రునిమీద వసతి చేసుకోవడం తటస్థించినప్పుడిది ఎంతో సహకారకం అవుతూంది. ఇంధనశక్తిసమస్య కొంతతగ్గుతుంది.

చంద్ర రాత్రిని సృష్టించడానికై నిర్ణీతమైన వెలుతురు వేడి, గ్యాస్ సరఫరా, రసాయనిక పోషణలతో వివిధ ఫిటోట్రానలు వాడేవారు. శీతలానికి గడ్డకట్టిపోయే ప్రత్యేక గదులలో చంద్రరాత్రి సృష్టించబడింది. భూమిమీద కన్న తక్కువగా వుండే చంద్రాకర్షణ శక్తిని సృష్టించడం సాధ్యం కాలేదు. అల్పాకర్షణశక్తి వున్నా మొక్కలు నిలబడడానికి చాలునని అభిప్రాయం వుంది అన్ని మొక్కలూ చంద్ర రాత్రులను భరించలేవని తేలింది. వేడికికోరె టొమాటో, దోస మొదలయినవి అధికోష్ణానికి నీరసించి చచ్చిపోతాయి. అల్పోష్ణంలో చలికి చచ్చిపోతాయి.

భవిష్యత్తులో చంద్రుని మీద మానవుడు మకాము పెట్టినప్పుడు అతనికి ప్రాణవాయువునూ, ప్రాణాధారక ఆహారాన్ని యివ్వగల మొక్కలను వెదకటంలో ఒకటి తేలింది. అక్కడ సూర్యకాంతిని సరాసరి వుపయోగించరాదు. చదరపు మీటరుకు 600 వాట్ల ఉష్ణోగ్రత చంద్రునిమీద ప్రసరిస్తుంది. మనకు కావలసింది 100 – 200 వాట్లు ఉష్ణోగ్రత మాత్రమే. చంద్రుని వాతావరణం వుండివుంటే సూర్యుని నుంచి వచ్చే ఇన్‌ఫ్రారెడ్, ఇన్‌ఫ్రావైలెట్ ఉష్ణ ప్రసారాన్ని చాలావరకు తగ్గించదు. కాని అది లేకపోవడం చేత ఫిల్టర్లు వుపయోగించడం అవసరం.

మొక్కలు పెరగడానికి చంద్రునిలోని మట్టి పనికొస్తుందా? అమెరికను శాస్త్రవేత్తల పరిశోధనలో ఆ మట్టి మొక్కలకు విషంకాదు – అని తేలింది. కాని మొక్కలకు కావలసిన పోషక పదార్థాలన్నీ దానిలో లేవు.

మన్ను లేకుండా నీటిలో మొక్కల్ని పెంచే ప్రయత్నాలలో కుండీలు నింపేందుకు పోసే కంకర. ఇసక మాదిరిగా చంద్ర మృత్తిక నుపయోగించవచ్చు. అవసరమైన రసాయనిక పదార్థాలను ముఖ్యంగా నైట్రిక్, ఫాస్ఫరస్ మిశ్రమాలను భూమినుంచి తీసికెళ్లాలిసుంటుంది, మొక్కల సజీవ శరీరాల్లూ లవణాలు 5–7 శాతం మించి వుండవు. కనక లవణాల అవసరం అధికంగా వుండదు. మనిషి సృష్టించిన నీటిని కర్బనద్వ్యామ్లజనిదాన్ని వుపయోగించి ఫోటోసింథసిస్ ప్రక్రియలో మొక్కలు సేంద్రియ పదార్థాన్ని నిర్మిస్తూ మానవునికి ప్రాణవాయువును, శుద్ధోదకాన్ని, ఆహారాన్నీ అందచేస్తాయి.

— [సోవియట్ ఇ టెక్నికా]

8—7—77

---

## రాజధానిలో జపాన్ రక్షణ దళబృందం

పదహారుమంది సభ్యులుగల జపాన్ నేషనల్ డిఫెన్స్ కాలేజి బృందం జూన్ 9న ఢిల్లీ చేరుకున్నది. యీ బృందం నేడు నేషనల్ డిఫెన్స్ కాలేజీని సందర్శించింది. ఈబృందానికి లెఫ్టినెంట్ నసాకీ సహాయానాయకత్వం వహించారు. కాలేజిలోని వివిధశాఖలను ఈ బృందానికి కమాండెంటు ఎయిర్‌మార్షల్ టి. ఎస్. గాఢియోక్ చూపెట్టారు. తరువాత వీరు పదాతి నావిక, వాయుదళాల ఉపఅధిపతులను కలుసుకున్నారు వారు విదేశాంగశాఖ కార్యదర్శినీ, రక్షణ మంత్రిత్వ శాఖ అడిషనల్ కార్యదర్శిని కలుసుకున్నారు. వారు యింకా ఆగ్రాలోని సైనికయూనిట్‌నూ, ఢిల్లీ పరిసర ప్రాంతాలలోని పారిశ్రామిక యూనిట్లనుసందర్శించారు.

---

## కాకతీయ శిల్పం

శ్రీ చలసాని ప్రసాదరావుగారి కళావిమర్శకవ్యాసాల సంపుటి యిది. కాకతీయ శిల్పమంటే, మాతృప్రాభ ఎంతో శిల్పకళ, కాకతీయ చిత్రకళ, వాస్తుశిల్పం : కాకతీయశైలి, నృత్యశిల్పం, అలంకరణకళ, జానపద శిల్పం మొదలైన వ్యాసాలతో ఆసక్తిని కలిగించే యీ పుస్తకాన్ని అనుపమ ప్రచురణలు 10—3—317 విజయనగర్ కాలనీ, హైదరాబాద్—500 028 వారు ప్రచురించారు. వెల 10 రూ. శ్రీ ప్రసాదరావు ఆంధ్ర చిత్రకళ, శిల్పకళలపై ఇంకా ఎన్నో గ్రంథాలు రచించి కళావాఙ్మయాన్ని సంపన్నం చేస్తారని ఆశించవచ్చు.



# సంస్మరణ

## కొడాలి విక్రమరావు

నీవు మమ్ములనందరిని వదలి అమరుడవై సంవత్సరము రోజులు గడచి పోయినను నీ స్మృతులు మా యెదలో మెదలుచునే యున్నవి.

జననం : 14—1—1956
మరణం: 21—6—1976

తండ్రి : కొడాలి మధుసూధనరావు,
తల్లి : వెంకటరత్నబాయమ్మ
బావ : వి. శరత్ బాబు, చెల్లెలు : సుందరి
అన్నలు : సాంబశివరావు, ప్రభాకరరావు
వదినలు : రాణి, వీరకుమారి





# అవీ — ఇవీ — అన్నీ

## 'నెఫ్జా' సంగీత నృత్య కళాపరిషత్

నెఫ్జా ఆధ్వర్యాన 1977 జూలై రెండవ వారములో అఖిలభారత స్థాయిలో నృత్యములలోను, పాటలలోను నెల్లూరు టవునుహాల్‌లో పోటీలు జరుపబడును. భరతనాట్యం, కూచిపూడి,రికార్డు డాన్సులు, సినిమా పాటలు, లలిత సంగీతం—హిందీ సినీ పాటల పోటీలు జరుపబడును. న్యాయ నిర్ణేతలుగా సినీ సంగీత దర్శకులు, సినీ దర్శకులు వ్యవహరింతురు. వివరాలకు : సెక్రెటరి, నెఫ్జా నాటక కళాపరిషత్, నియర్ లీలామహల్, నెల్లూరు 524 001 వ్రాయాలని కార్యదర్శి తెలుపుతున్నారు.

## అర్ధరాత్రి సూర్యుడు

కవితాసంపుటి—రచయిత జక్కని వెంకటరాజం ప్రచురణ : యువసాహితీ సమితి—సిరిసిల్ల. వెల 4 రూపాయలు ప్రతులకు జక్కని వెంకటరాజం 5.2.103, సుభాష్‌నగర్, సిరిసిల్ల, కరీంనగర్ జిల్లా స్వీకర్త డా. సి. నారాయణరెడ్డి ఆశీస్సులతో వెలువడిన ఈ కవితాసంపుటిలో అర్ధరాత్రిసూర్యునినుంచి ప్రస్థానం దాకా ఆధునిక వచన కవితను ప్రతిబింబిస్తూ మంచి భావస్ఫూర్తితో కూడిన 49 ఖండికలు ఉన్నాయి.

## శ్రీ కురవి వీరభద్ర మాహాత్మ్యము

రచన: శ్రీ వుయ్యూరు పూడి సచ్చిదానందశాస్త్రి 64 పేజీలు, వెల 3 రూపాయలు. ప్రచురణ సాహిత్య రంజని, ఇం. నెం. 17—7—818, యాకుత్‌పురా, హైదరాబాద్— 23.

## భ్రమ

నాటిక — రచయిత డాక్టర్ త్రిపురనేని వెంకటేశ్వరరావు మనుష్యుల మానసిక బలహీనతలను, వారిలోని మూఢ నమ్మకాలను ఎత్తిచూపే 32 పుటల చిన్ననాటిక యిది. గుడివాడ హేతువాద సంఘము [కవిరాజు సాహిత విహారము] వారు దీనిని ప్రచురించారు.





Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna

# హార్లిక్స్

Horlicks
THE IDEAL FOOD DRINK

## ఆరోజుకు ఆరోజు రోగనివారణ శక్తిని పెంచి ఆరోగ్యాన్ని కాపాడే పౌష్టికాహారం.

హార్లిక్స్ నిత్యం సేవించినట్టయితే, మీ కుటుంబానికి రోగాలు రాకుండాతట్టుకునే శక్తి పెరుగుతుంది. వారికి సంపూర్ణమయిన ఆరోగ్యం చెకురుతుంది. ఆరోగ్యం మహాభాగ్యం.

హార్లిక్స్, ప్రపంచం అంతటా డాక్టర్లు సిఫార్సు చేసేది ఇది ఒక్కటే, మీకు అత్యధికంగా పుష్టి ఇచ్చేది ఇది ఒక్కటే ఎందుచేతనంటే ఇందులోను సంపన్నమయిన స్వచ్ఛమయిన పదార్థలు; అపూర్వమయిన హార్లిక్స్ పద్ధతి ప్రకారం సమ్మిళితమితాయి; దీనివల్ల వీటి సహజ సద్గుణాలు నష్టంకావు. అవి సులువుగా జీర్ణం అవుతాయి.
అందువల్లనే సుచిత్ర హార్లిక్స్‌ని తన కుటుంబ జీవితంలో భాగంగా చేసుకుంది

సుచిత్ర మోస్తరుగానే మీరుకూడా మీకుటుంబానికి ప్రతిరోజు హార్లిక్స్ ఇవ్వండి వారు ఆరోగ్యంగా, బలంగా పెరగడం మీకు కనబడుతుంది.

"హార్లిక్స్ ప్రధానమయిన పుష్టి సాధనం. మీకుటుంబంలోనివారికి వ్యాధులు రాకుండా తట్టుకునే శక్తి పెరిగేందుకూ వారు ఆరోజుకారోజు ఆరోగ్యంగా, చురుగ్గా ఉండేందుకూ నేను హార్లిక్స్‌ను సిఫారుసు చేస్తున్నాను"



**హార్లిక్స్ మంచి పుష్టికరమైనది**

హార్లిక్స్ రిజిష్టర్డ్ ట్రేడ్ మార్క్.

# ఐటెక్స్
## ప్రసిద్ధి పొందిన కాటుక & తిలకము







లక్షలకొలది స్త్రీలు, బాలికలు ఐటెక్స్ కాటుక & తిలకము మరల మరల కొనుచుందురు? ఎందుకంటే,

ఐటెక్స్ కాటుక మిశ్రములేని మంచినూనెతో చేయబడినది - ఐటెక్స్ కాటుకలో యితర మందులు (Chemicals) లేక మైనము ఉండదు - ఐటెక్స్ కాటుక కండ్లకు కూడా ఉపయోగించతగినది - ఐటెక్స్ కాటుక పుట్టిన పాపలకు కూడా ఉపయోగింపబడుచున్నది.

ఐటెక్స్ తిలకము మంచి వస్తువులతో, రంగులతో చేయబడినది - ఐటెక్స్ తిలకము మన మృదువైన చర్మమునకు ఉపయోగించుటకు సరియైనది - ఐటెక్స్ తిలకము మెరుస్తున్న రంగులలో మనోహరమైన వాసనద్రవ్యములతో ఉండుటచేత మన అందమును వికశింపజేయును - ఐటెక్స్ తిలకము మన చర్మమును బాధపరచదు అని వారికి తెలియును.



తిలకము చేయబడిన వస్తువుల నాణ్యతలో వారికి నమ్మకమున్నది. అవును. ఈనాడు ఐటెక్స్ నమ్మకమునకు ఒక చిహ్నము. ఎందుకు మీరు కూడ వారితో కలిసి ఈనాడు ఐటెక్స్ కాటుకను, తిలకమును కొనకూడదు?




**ARAVIND LABORATORIES**
**MADRAS-600033**